# స్వరాధిదేవత




మండలి వెంకట కృష్ణారావు

తెలుగు వైభవ పురస్కార గ్రహీత

శ్రీమతి పి. సుశీల

**అభినందన గ్రంథం**

C1



ప్రపంచ తెలుగు మహాసభల్లో శ్రీమతి పి. సుశీలకు ప్రశంసాపత్రం అందజేస్తున్న
విద్యా, సాంస్కృతికశాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు

# స్వరాధిదేవత





**మండలి వెంకట కృష్ణారావు**

తెలుగు వైభవ పురస్కార గ్రహీత

## శ్రీమతి పి. సుశీల

---

## అభినందన గ్రంథం

---

04-08-2018

స్వరాధిదేవత
పి. సుశీల

SWARADHIDEVATA
P. SUSHEELA

ముఖచిత్రం మరియు పుస్తకంలోని
సుశీల గారి ఫోటోల కర్టెసీ : సంజయ్ కిషోర్

వెల : అమూల్యం

ప్రథమ ముద్రణ : ఆగస్టు 4, 2018

ప్రచురణ:




మండలి ఫౌండేషన్
గాంధీక్షేత్రం, అవనిగడ్డ - 521 121
కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్.

ముద్రణ:
సాయిలిఖిత ప్రింటర్స్
ఖైరతాబాద్, హైదరాబాద్ - 500 004.
ఫోన్: 7207045979

2



ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలలో శ్రీమతి పి. సుశీలను సత్కరిస్తున్న రాజ్యసభ ఉపాధ్యక్షులు
శ్రీ గోడే మురహరి, విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు





# స్వరాధిదేవతకు అక్షరాంజలి

- డా॥ మండలి బుద్ధప్రసాద్
ఉపసభాపతి, ఆంధ్రప్రదేశ్ శాసనసభ
వ్యవస్థాపకులు, మండలి ఫౌండేషన్

నమస్తే సమస్తాంధ్ర నవరసాలంకృతీ!
మృదుమధుర, శుచిరుచిర ప్రియ తెలుగు భగవతీ!
నవరసాలంకృతీ! నమస్తే!

★ ★ ★

తేనెలో మాగిన తియ్య మామిడిపండు
పన్నీట పెరిగి పాల చెఱుకురసంబు,
కలసి కమ్మదనాలు, మెలసి మెత్తదనాలు,
మందార మాకంద మకరంద పాకమై

స్తన్యమాయె మహాంధ్ర సంతతికి తెలుగు
మురళికిని వీణె నను శ్రుతి సరళి నేర్ప,
భ్రమర పిక కంఠములను రాగములు నింత
పాటకును పద్యమునకును ఫణితిదిద్ద
స్తన్యమాయె మహాంధ్ర సంతతికి తెలుగు

*(రాయప్రోలు సుబ్బారావు స్వాగతం గీతం)*

స్వర్గాల కాంతిస్వప్నాలను, స్వప్నాల శాంతి స్వర్గాలను ఆవాహన చేసుకున్న మహనీయుడు మా నాన్నగారు కీ.శే. మండలి వెంకట కృష్ణారావుగారు. తెలుగు భాషా చైతన్య దీప్తికి అహరహం తపించిన భాషాయోధుడాయన. మహోన్నతులైన తెలుగు మణిదీపాల పట్ల అమిత గౌరవ ప్రపత్తులు ప్రదర్శించి లోకానికి వెల్లడి చేశారాయన. నవ్యతలు నెరపిన ప్రబంధ సాహిత్యం, త్యాగరాజ స్వామి ప్రేమరాగాల ఊయలలో కమ్మగా ఊగిన గానలక్ష్మి, తెలుగు భాషా సంస్కృతులను వేలకాంతులతో అలంకరించిన జాతీయోద్యమ సాహిత్యం ఇవి మన ఘనకీర్తికి తార్కాణాలని నమ్మేవారు మా నాన్నగారు.

"తెలుగు భాష తెలుగు బిడ్డలకు అమ్మపాల వంటిది. మురళీరవానికి, వీణానాదానికి తానే శృతిగా నిలిచిన భాష. పాటకైనా, పద్యానికైనా ఒక ఒరవడి దిద్దిన భాష, మహాంధ్రసంతతి స్తన్యమై పెంచిన భాష. తెలుగు నుడికారపు సొంపులకు ముగ్ధుడై, తెలుగులోనే మాట్లాడుతూ శ్రీ కృష్ణదేవరాయలు దేశభాషలందు 'తెలుగు లెస్స' అని ప్రకటించటం గొప్పవిషయం"

అంటూ రాయప్రోలు వారు స్వాగతించిన గొప్ప భాష మన తెలుగు. ఈ గీతం అంటే మా నాన్నగారికి ఎంతో ఇష్టం.

తెలుగుజాతి చరిత్రలో మొదటిసారిగా విశ్వవ్యాప్తంగా ఉన్న తెలుగువారందరినీ ఒకే వేదికపైకి తీసుకువచ్చి ప్రపంచతెలుగు మహాసభలు తొలిసారిగా రాష్ట్రప్రభుత్వం పక్షాన నిర్వహించారు. దేశవిదేశాల్లో ఉన్న మహోన్నత తెలుగు వ్యక్తులను తెలుగు వెలుగు పురస్కారాలతో సత్కరింపచేశారు.

తాను అవనిగడ్డలో నెలకొల్పిన గాంధీ క్షేత్రానికి ఎందరెందరో ప్రసిద్ధ వ్యక్తులను ఆహ్వానించి వారిని దివిసీమ ప్రజలకు పరిచయం చేయటమే కాకుండా, వారిని సత్కరించి సంతృప్తి చెందేవారు.

మా నాన్నగారు ఆచరించి చూపిన మార్గంలో వారి తదనంతరం అయన పేరిట ప్రసిద్ధులైన తెలుగు సాహితీమూర్తులకు, భాషావేత్తలకు, కళాకారులకు పురస్కారాలను అందించి గౌరవిస్తూ వస్తున్నాము.

దేశవిదేశాల్లో తెలుగు భాష సంస్కృతుల వికాసానికి కృషి చేస్తున్న వ్యక్తులకు, సంస్థలకు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం - మండలి వెంకట కృష్ణారావు అంతర్జాతీయ తెలుగు అధ్యయన కేంద్రం ద్వారా “మండలి వెంకట కృష్ణారావు సంస్కృతీ పురస్కారం” అందజేస్తున్నాము.

కృష్ణాజిల్లా రచయితల సంఘం ద్వారా గత పది సంవత్సరాలుగా ప్రతీ యేటా తెలుగు భాష, సాహిత్యాలలో విలక్షణతను కనబరచినవారికి “మండలి వెంకట కృష్ణారావు భాషా పురస్కారం” అందిస్తున్నాము. అలాగే అవనిగడ్డ గాంధీక్షేత్రంలో ప్రతీ సంవత్సరం మా నాన్నగారి జయంతి రోజున అనేకమంది సమాజ సేవకులను, కళాకారులను సత్కరించి గౌరవిస్తున్నాము.

మండలి వెంకట కృష్ణారావుగారి మనుమలు, మనుమరాండ్రు, కుటుంబంలోని తదితరులంతా కలిసి “మండలి ఫౌండేషన్”ను వ్యస్థాపించి దాని ద్వారా “మండలి వెంకట కృష్ణారావు తెలుగు వైభవ పురస్కారం” పేరుతో జాతీయ అంతర్జాతీయ స్థాయిలలో తెలుగు జాతి గౌరవాన్ని నిలబెట్టిన ప్రముఖులకు ఒక లక్ష నగదు పురస్కారాన్ని అందించాలని నిర్ణయించారు.

తొలి పురస్కారం ఎవరికి అందజేయాలనే అంశం చర్చకు వచ్చినప్పుడు, “పాడనా తెలుగు పాట-పరవశనై” అంటూ తెలుగు భాష తీయందనాన్ని తన సినీగీతాల ద్వారా విశ్వవ్యాప్తం చేసిన స్వరాధిదేవత పి. సుశీల గారికి అందజేయటం సముచితమని భావించాము.

“ఒక్క సంగీతమేదో పాడునట్లు భాషించునపుడు విన్పించుభాష-విస్పష్టముగ నెల్ల విన్పించునట్లు స్పష్టోచ్చారణంబున నొనరు భాష” అని విశ్వనాథవారన్నట్టు తెలుగు మాటల్లోని

సంగీతాన్ని తన గానమాధుర్యంతో విశ్వపరీవ్యాప్తం చేసిన మహాగాయని సుశీలగారు. "అరవజాతిని పాటకులుగా తీర్చిదిద్దిన తెలుగువాణి" అంటూ రాయప్రోలు వారు కర్ణాటక సంగీత గాయకులు ఏ భాషీయులైనా తెలుగులోనే శృతిలయలను గ్రహించటం విశేషం" అన్నారు. కర్ణాటక సంగీతం తమిళనేలపైన తెలుగు భాషలో వికాసాన్ని పొందటం గొప్ప విషయం.

తెలుగు సంస్కృతికి కర్ణాటక సంగీతం ఎంతగానో దోహదం చేసింది. త్యాగయ్య, అన్నమయ్య వంటి స్వరకర్తలు, పదకర్తలు, వాగ్గేయకారులూ ఎందరో తెలుగు సాహిత్యాన్ని, భాషను, సంస్కృతినీ సుసంపన్నం చేశారు.

సామాన్య ప్రజలనుండి, వాళ్ల నానుడి నుండి, సామెతల నుండి, వారి నిత్యజీవితంలో వేళ్ల పాతుకుపోయిన మాటవిరుపుల నుండి ఈ వాగ్గేయకారులు అనేక మాటలను సేకరించుకున్నందునే ఈ మహా కళాకారుల కీర్తనలు అద్భుతమైనవిగా రూపొందాయి. ఇవి వాటిని సామాన్యుల హృదయాలకు సన్నిహితం చేసినవి. త్యాగరాజు తెలుగుజాతి ఉదాత్త, ఆధ్యాత్మిక ప్రవృత్తులను స్వీకరిస్తే, క్షేత్రయ్య తెలుగువారి శృంగార సౌందర్యారాధనా ప్రవృత్తులను ప్రతిబింబించాడు. సంగీత నాట్య రంగాలలో ప్రస్తుతం తమిళనాడు సాధించిన మహోన్నతస్థాయి తెలుగు సంస్కృతి ప్రభావం ఫలితమేనని చెప్పవచ్చు. తెలుగువారు రెండు శతాబ్దాల క్రితం తమిళ దేశాన్ని పరిపాలించారు. తెలుగు సంస్కృతి వారి కళలపై చెరగని ముద్రవేసింది" అని విశ్వనాథ సత్యనారాయణగారు అన్నారు. పి సుశీలగారు ఆ కోవలో తమిళ నేలను సంగీతమయం చేసిన ప్రముఖురాలిగా కనిపిస్తారు.

డా. సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు "ప్రాచ్యదేశ భాషలలో ఇటలీభాష వంటిది తెలుగు భాష-అని పొగడబడినది తెలుగు భాష. అజంతములతో నిండియుండుటే దాని విశేషము. అట్టి భాష త్యాగబ్రహ్మ ఉత్తమ కళాసృష్టికి అనుకూలముగా అమరినది" అన్నారు.

శ్రీపాద పినాకపాణిగారు "కర్ణాటక సంగీతమున కృతులు నూటికి 90పాళ్లు ఆంధ్రభాషయందున్నవి. అది మన యదృష్టము తమ భాషకాకున్నను, తమిళ విద్వాంసులు తెలుగు భాషలోనున్న వందలకొద్దీ కృతిరత్నములను అతికష్టముగ నేర్చి, సంప్రదాయసహితముగా కాపాడియుంచిరి..." అని వివరించారు.

పూర్వకాలం నుండీ తెలుగు భాష సంగీత ప్రధానంగా రూపు కట్టుకొని ఎదిగింది. తెలుగు వారికని మాత్రమే కాకుండా విశ్వమానవాళికి వీనులవిందు చేసింది.

ఆధునిక కాలంలో సినీ సంగీతం పట్ల శ్రోతలు ఎక్కువ మక్కువ చూపటం ఒక ముఖ్య పరిణామం. 18 వేలకు పైగా పాటలను ఇంచుమించు 10 భాషల్లో పాడి గిన్నిస్ బుక్ వారి అవార్డు దక్కించుకున్న పి. సుశీలగారికి "మండలి వెంకట కృష్ణారావు తెలుగు వైభవ పురస్కారం" అందించాలని నిర్ణయించటం జరిగింది.



*శ్రీమతి సుశీలతో శ్రీ మండలి బుద్ధప్రసాద్*

శ్రీమతి పి. సుశీల మహోదాత్త గాయనే కాకుండా మూర్తీభవించిన మానవతామూర్తి. అనేక ధార్మిక కార్యక్రమాలకు చేయూతనిచ్చింది. 1975లో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలకు తెలుగు సినీ ఆర్టిస్ట్స్ అసోసియేషన్ నిధుల సేకరణ చేపట్టినప్పుడు రాష్ట్రంలో పలుప్రాంతాల్లో ఆమె బస్సులో ప్రయాణించి నిధుల సమీకరణ చేశారు. సుశీలగారితోపాటు మా నాన్నగారు అప్పటి విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు కూడా ఆ బస్సులో సినీ కళాకారులతోపాటు ప్రయాణించారు.

1977 నవంబరు 19న దివిసీమ ఉప్పెన సంభవించినప్పుడు శ్రీ యన్ టి రామారావు, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు నాయకత్వాన నిధుల సమీకరణ కార్యక్రమంలో సుశీలగారు కూడా పాలుపంచుకున్నారు. అంతకుముందు దేశరక్షణ నిధికి నిధుల సేకరణ కోసం ఆమె తోడ్పడ్డారు. ఈ విధంగా ఆమె తన గంధర్వగానంతో ఎన్నో సంస్థలకు నిధులను సమకూర్చిపెట్టింది. స్వయంగా తన పేరున "పి సుశీల ట్రష్టు"ని స్థాపించి, పేద సంగీత కళాకారులకు ఆర్థిక సహాయం చేశారు.

గాయనిగా, మానవతామూర్తిగా, బీద కళాకారులకు అండగా నిలిచిన కారుణ్యమూర్తిగా నిలిచిన శ్రీమతి పి సుశీలగారికి ఈ పురస్కారం సముచితమైనదిగా భావిస్తున్నాము.

"నేను తెలుగు వాణ్ణి అనుకున్నప్పుడు వొళ్లు పరవశిస్తుంది. నాది తెలుగు గడ్డ అనుకోగానే ఏదో దివ్యలోకంలో వున్న అనుభూతి కలుగుతుంది" అనేవారు మా నాన్నగారు మండలి వెంకట కృష్ణారావుగారు. ఆయన వేసిన బాటలోనే చేయంగల సేవ చేయడానికి ఈ మండలి ఫౌండేషన్ స్థాపన జరిగిందని మనవి. ఇందుకు సహకరిస్తున్న అందరికీ మా ప్రణామాలు.



శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణతో శ్రీమతి పి. సుశీల



గౌరవ భారత రాష్ట్రపతి శ్రీమతి ప్రతిభాపాటిల్ నుండి పద్మభూషణ్ పురసారాన్నందుకుంటున్న
శ్రీమతి పి. సుశీల





# 'గానకోకిల' పి. సుశీల జీవిత విశేషాలు

*సేకరణ: సంజయ్‌కిషోర్*

| | | |
|---|---|---|
| ✦ | పూర్తి పేరు | : పులపాక సుశీల |
| ✦ | పుట్టిన తేది | : 13-11-1935 |
| ✦ | పుట్టిన ఊరు | : విజయనగరం |
| ✦ | తల్లిదండ్రులు | : శ్రీ ముకుందరావు, శ్రీమతి శేషావతారం |
| ✦ | తండ్రిగారి వృత్తి | : లాయరు |
| ✦ | సంగీత శిక్షణ | : విజయనగరం మహారాజా సంగీత కళాశాలలో గాత్రంలో డిప్లమో కోర్సునూ, చెన్నైలోని తమిళనాడు ప్రభుత్వ సంగీత కళాశాలలో 'విద్వాన్' కోర్సునూ చేశారు. |
| ✦ | పాడిన తొలి చిత్రం | : కన్నతల్లి (1953) |
| ✦ | పాడిన భాషలు | : తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం, హిందీ, ఒరియా, సింహళం. |
| ✦ | మొత్తం పాటల సంఖ్య | : ఇరవై వేలకు పైగా |
| ✦ | ఉత్తమ గాయనిగా జాతీయ అవార్డులు అందుకున్నవి | : ఉయరంద మనిదన్ - తమిళం - 1969<br>సవాలే సమాళి - తమిళం - 1971<br>సిరిసిరిమువ్వ - తెలుగు - 1977<br>మేఘసందేశం - తెలుగు 1982<br>ఎం.ఎల్.ఏ. ఏడుకొండలు - తెలుగు - 1983 |

✦ **ఉత్తమ గాయనిగా రాష్ట్రస్థాయి అవార్డులు :**

| | |
|---|---|
| ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నంది అవార్డులు (6 సార్లు) | : దానవీరశూరకర్ణ - 1977<br>నాలాగ ఎందరో - 1978<br>మేఘసందేశం - 1982<br>సంగీత సామ్రాట్ - 1984<br>విశ్వనాథ నాయకుడు - 1987<br>గోదావరి పొంగింది - 1989 |





| | | |
|---|---|---|
| తమిళనాడు ప్రభుత్వ అవార్డులు (3 సార్లు) | : | లక్ష్మీ కళ్యాణం - 1969<br>అన్బు అత్తాన్ - 1981<br>వరం - 1989 |
| కేరళ ప్రభుత్వ అవార్డులు (రెండు సార్లు) | : | ఒరు పెణ్ణిందె కథ - 1971<br>చువర్ణ సంధ్యగళ్ - 1975 |

✦ **అందుకున్న ప్రభుత్వ పురస్కారాలు :**

| | | |
|---|---|---|
| భారత ప్రభుత్వం | : | పద్మభూషణ్ (2008) |
| ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం | : | రఘుపతి వెంకయ్య అవార్డు (2004) |
| తమిళనాడు ప్రభుత్వం | : | కలైమామణి (1978)<br>అన్నా అవార్డు (2003)<br>భారతీదాసన్ అవార్డు |

✦ **అందుకున్న గౌరవ డాక్టరేట్లు :**
1) ఆంధ్రా యూనివర్శిటీ వారి గౌరవ డాక్టరేట్
2) నార్త్ అమెరికన్ అల్యూమ్ని అసోసియేషన్, అమెరికా వారి గౌరవ డాక్టరేట్

✦ **లైఫ్ టైం ఎఛీవ్‌మెంట్ అవార్డులు:**
1) ఫిలింఫేర్
2) స్క్రీన్
3) సినిమా ఎక్స్‌ప్రెస్
4) బొమ్మై
5) రేడియో మిర్చి

ఇవేగాక మద్రాస్ ఫిలిం ఫాన్స్ అసోసియేషన్‌చే 26 సార్లు ఉత్తమ గాయనిగా ఎంపికయ్యారు.

ఇక ప్రపంచ వ్యాప్తంగా ఉన్న వివిధ కళా సంస్థల నుండి అనేక సన్మాన సత్కారాలు అందుకున్నారు.

| | | |
|---|---|---|
| ✦ వివాహ తేది | : | 4-3-1957 |
| ✦ భర్త పేరు | : | డా॥ రాజారామ్మోహనరావు |
| ✦ భర్త వృత్తి | : | వైద్యులు |
| ✦ సంతానం | : | ఒక కుమారుడు - జయకృష్ణ |
| ✦ కోడలు | : | శ్రీమతి సంధ్య |
| ✦ మనుమరాళ్ళు | : | జయశ్రీ, శుభశ్రీ |
| ✦ ప్రస్తుత నివాసం | : | చెన్నై |



శ్రీ శివాజీ గణేశన్, రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ, జెమిని గణేశన్, శ్రీమతి పి. సుశీల



శ్రీమతి సుశీలను సత్కరిస్తున్న మహానటి సావిత్రి



లతామంగేష్కర్ నుండి సత్కారాన్నందుకుంటున్న శ్రీమతి పి. సుశీల



శ్రీ భగవాన్ సత్యసాయిబాబా వారితో శ్రీమతి సుశీల, డాక్టర్ మోహనరావు





# గాన సరస్వతికో అక్షరమాల

- భువనచంద్ర

సుశీల అంటే సంగీతం. ఆమె "స్వర సౌందర్యలహరి". జాహ్ను మహర్షి గంగాదేవిని పుక్కిట బట్టినట్టు పి. సుశీలగారు రాగస్వరాన్ని సంపూర్ణంగా గళంలో నిక్షిప్తం చేసుకున్నారు.

మధురాష్టకంలో 'మధురాధిపతే అఖిలం మధురం' అన్నట్లు సుశీల గారి మాట, పాట, రూపం, చిరునవ్వు అన్నీ మధురమే. అత్యంత మృదుస్వభావి. ఏ మాత్రం భేషజం ఉండదు.

తెలుగు సినీ చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయదగిన గాయనీమణుల నామధేయాల్లో ముందుగా గోచరించేది సుశీలగారి పేరే. వేలాది పాటలు...ప్రతి పాట ఆణిముత్యమే. నిపుణుడైన శిల్పి చేతిలో శిల అద్భుతమైన శిల్పంగా రూపుదిద్దుకున్నట్టు, ఎంత నిస్సారమైన పాటైనా సుశీలగారి గళంలో ఒదిగి అద్భుతమైన శ్రవణ కావ్యంగా మారుతుంది. పాటకు ప్రాణం పోసే గాయని సుశీలగారు. ఒకటికి పదిసార్లు పాట 'లోతుల్ని' అర్థం చేసుకుని, ఆ గీతానికి అనిర్వచనీయమైన అందాన్ని సమకూర్చి, ప్రేక్షకులను, శ్రోతలను సమ్మోహన పరుస్తారు సుశీలగారు. ఆమె గళం 'నిత్య యవ్వని'.

చిన్నతనం నుంచీ సుశీలగారి పాటలు వింటూ పెరిగిన నేను, వారు నా 'పాటలు' పాడటం నిజంగా నా పూర్వ జన్మ సుకృతం. అదీ నా రెండో చిత్రంలోనే. 'మా ఇంటి మహారాజు' చిత్రంలో 'అందాల హరివిల్లు మా బొమ్మరిల్లు' అన్న పాటని వారు నాకు పాడిన మొదటి పాట. అప్పటి నుంచీ గత 32 సంవత్సరాలుగా వారిని నేను కలుస్తూనే ఉన్నాను. దర్శించుకుంటూనే ఉన్నాను. వారి ఆశీస్సులు అందుకుంటూనే ఉన్నాను.

కొన్ని దశాబ్దాల తెలుగు పాటకు చిరునామా గాయని సుశీలగారు. ఎన్ని భాషలో.... ఎంతమంది సంగీత దర్శకులో... ఎందరు రచయితలో.... ఎంతమంది కథానాయికలో... నటీమణులో... అందరూ సుశీలగారి స్వర మండపంలో ఆతిథ్యం స్వీకరించిన వారే! దాశరథిగారన్నట్టు సుశీలగారు నిజంగా "స్వరాధిదేవతే". స్పష్టమైన ఉచ్చారణకు మారుపేరు పి. సుశీల. లాలిత్యానికి, భావప్రకటనకి మరోపేరు పి. సుశీల. దక్షిణ భారతదేశమే కాదు ఉత్తర భారతదేశంలో కూడా ఆవిడ పాడినన్ని పాటలు మరెవరూ పాడలేదు నేటి వరకూ. అది 'గిన్నిస్ బుక్' నిర్ధారించిన విషయం. గిన్నిస్ బుక్ అవార్డు సుశీలగారికి జనవరి 28, 2016న ఇచ్చారు.

ఓ.పి. నయ్యర్ అవార్డు, 'ఇసై అరసి' అవార్డు, అరింజర్ అన్నా అవార్డు, లైఫ్ టైమ్ ఎచీవ్ మెంట్ అవార్డు, 'గానసరస్వతి' అవార్డు, శ్రీకాళహస్తి దేవస్థాన 'ఆస్థాన గాయని' గౌరవం, శ్రీ రఘుపతి వెంకయ్య అవార్డు, అన్నిటికీ మించి "పద్మభూషణ్" జాతీయ అవార్డు, ఇలాంటి





లెక్కలేనన్ని అవార్డులు ఆమెను వరించడం కేవలం అదృష్టం వల్ల కాదు. కఠోర పరిశ్రమ, నిరంతర శ్రమ, పాడే పాట మీద భక్తి, శ్రద్ధ వల్ల మాత్రమే. పి. సుశీలగారు మరెవరూ అందుకోలేని ఎత్తుకి ఎదిగారు. నీళ్ళు లేని సముద్రాన్ని ఊహించుకోగలమేమో గాని సుశీలగారి పాట లేని సినిమా మాత్రం కొన్ని దశాబ్దాల పాటు దక్షిణ భారత సంగీత దర్శకులు ఊహించలేకపోయారు. ఆమె గాత్రం 'సూట్' అవని నాయిక దక్షిణ భారతదేశంలో లేనేలేదు. అంతగా ఆమె స్వరం కథానాయికల ముఖాల్లో ప్రతిఫలించేది.

నటుడు కెమెరా ముందు యాక్ట్ చేయాలి. అలాగే గాయకుడు మైక్ ముందు సరైన ఎక్స్ప్రెషన్ తో ఆలపించాలి. గాయనీ గాయకులూ ఎంత భావపూరితంగా గీతాన్ని ఆలపిస్తే, నాయికానాయకులు అంత అద్భుతంగా ఆయా గీతాలకి న్యాయం చెయ్యగలుగుతారు. సుశీలగారు మైక్ ముందు Act చెయ్యరు. ఆవిడ స్వరమే గీతానికి తగినట్టు, స్వరానికి తగినట్టు తనని తానే మలుచుకుంటుంది. నటీమణుల హావభావాల్ని సుశీలగారు తమ గళంతోటే పలికిస్తారన్నది జగమెరిగిన సత్యం. వీణతంత్రులన్నీ ఆమె గళంలో దాగాయి గనకే, వీణ పాటలలో స్పెషలిస్టుగా పి. సుశీలగారు జగద్విఖ్యాతమయ్యారు. ఎన్నిసార్లు 'వీణ' సుశీలగారి ముందు వినయంగా తలవంచుకుందో!

నాకు చాలా చాలా ఇష్టమైన పాటలు చెప్పకపోతే ఎలా?

'బాలనురా మదనా' (రచన - పింగళి, సంగీతం-ఎస్. రాజేశ్వరరావుగారు, చిత్రం-మిస్సమ్మ) పాటను ఎప్పుడు విన్నా అద్భుతమే అనిపిస్తుంది. సాలూరి సుస్వరాలు, పింగళి పదాలు, జమున అభినయం, ఓహ్ ... మనసుని ఆనందసాగరంలో ఓలలాడిస్తాయి.

'పిలవకురా... అలుగకురా' (చిత్రం-సువర్ణసుందరి, రచన-సీనియర్ సముద్రాల, సంగీతం-పి.ఆదినారాయణరావు) అనే పాట మరో అజరామమైన గీతం. ఓ చారిత్రాత్మక విజయాన్ని సాధించిన గీతం. నిర్ద్వంద్వంగా ఆదినారాయణరావుగారిది సంగీతం, సముద్రాలగారి రచన, సుశీలగారి గాత్రం పోటీపడి పయనం సాగించడమే. కనీసం మరో వెయ్యేళ్ళు నిలిచే పాటిది.

"Songs of the hour & songs of all time - అన్న విభజన సాగిస్తే సుశీలగారి పాటల్లో నూటికి కనీసం 80 శాతం సాంగ్స్ ఆఫ్ ఆల్ టైమ్ క్రిందకే వస్తాయి.

సుశీలగారి గాత్రం లోంచి వెలువడిన జయదేవుని అష్టపది 'హరిరిహ ముగ్ధ వధూనికరే' (చిత్రం-తెనాలి రామకృష్ణ, సంగీతం విశ్వనాథన్ రామమూర్తి) అటువంటి ఆల్ టైమ్ హిట్స్ లో ఒకటి. ఆ పాట వింటుంటే చాలు, సంస్కృతం అర్థం కాని వారికి కూడా భక్తితో, ఆనందంతో ఒళ్ళు పులకరించిపోతుంది.

ఇక 'కన్యాశుల్కం' చిత్రంలో ఘంటసాల వారు స్వరపరచిన "ఆనందం అర్ణవమైతే,





అనురాగం అంబరమైతే” అన్న శ్రీశ్రీ గీతాన్ని సుశీలగారు పాడిన తీరు అమోఘం. అపూర్వం. ప్రతి పదంలోనూ అమృతాన్ని నింపింది సుశీలమ్మ. ‘మధురవాణి’ పాత్రని మరపురాని పాత్రగా మలిచింది మన సరస్వతమ్మ.

No. 9 జగదాంబాళ్ స్ట్రీట్, T. నగర్ లో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఉండేవారు. వారు నాకు పరిచయం అయ్యింది రాజకుమారీ టాకీస్ ముందర. వారి కృతులలో కూర్చుని ఉండగా వారిని గుర్తుపట్టి వారి పాదాలకి నమస్కరించాను. అప్పుడు నేను ఇండియన్ ఎయిర్ ఫోర్స్ లో ఉండేవాడిని. అప్పటికే వారి గొంతు మూగపోవడంతో చిన్న చిన్న నోటు బుక్స్ మీద పెన్నుతో రాసి చూపేవారు. నా వివరాలన్నీ తెలుసుకుని ఇంటి అడ్రస్ ఇచ్చి రమ్మన్నారు. ‘నా పాటల్లో నీకు ఏది ఇష్టం’ అని వారడిగితే నేనిచ్చిన సమాధానం ‘భాగ్యరేఖ’ చిత్రంలోని ‘నీవుండేదా కొండపై నా స్వామి’ అనే పాట అని. “పాడగలవా” అని slip మీద వ్రాశారు. పాడి వినిపించాను. (సంగీతం-పెండ్యాలగారు). వారు చాలా ఆనందించి ‘సుశీల గాత్ర మహిమ’ అని స్లిప్ మీద వ్రాశారు. వెంకటేశ్వరస్వామి వారిపై వచ్చిన పాటల్లో ఇదో అద్భుత గీతం. అతి సరళమైన భాష. అద్భుతమైన భావం. ఈ పాటలోని భక్తిభావం సుశీలగారి గళం నుంచి అమృతంలా జాలువారింది.

“సుందరాంగా అందుకోరా” అనే గీతం (చిత్రం-భూకైలాస్, రచన-సీనియర్ సముద్రాల, సంగీతం- R. సుదర్శనం, R. గోవర్ధనం) పి. సుశీలగారి గాత్ర వైరుధ్యానికి మరో మచ్చుతునక. హెలెన్ ఈ గీతానికి నృత్యం చేసింది. మొదట్లో కవ్వింపు, ఆ తర్వాత చివరిలో శివనామం జపించడంలోని తన్మయత్వం సుశీలగారిని హిమాలయాగ్రాన నిలబెట్టాయి.

ప్రతి ఉదయాన్ని స్వాగతించే సుశీలగారి మరో మనోహర గీతం ‘తెలియని ఆనందం ... నాలో.... కలిగినదీ ఉదయం’ (చిత్రం-మాంగల్యబలం, రచన-శ్రీశ్రీ, సంగీతం-మాస్టర్ వేణు) ఈ పాట వింటే అప్పుడప్పుడే కనులు విప్పే పూబాలలు, విరులతో మేలమాడే చిరుగాలులు అన్నీ సుశీలగారి స్వరంలోనే మనకి దర్శనమిస్తాయి.

‘నమ్మినబంటు’ సినిమాని మా ఊరి టూరింగ్ టాకీస్ లో 8 సార్లు చూశాను. మా ఇంట్లో పుష్కలంగా పాడి ఉండేది. ఆవులు, గేదెలు, బుల్లి బుల్లి తువ్వాయిలు, వాటి గంతులు అన్నీ నాకు మధురమైన బాల్యజ్ఞాపకాలే. ఆ సినిమాలోని కొసరాజుగారి పాట “చెంగు చెంగునా గంతులు వేయండీ, ఓ జాతివన్నె బుజ్జాయిల్లారా... నోరు లేని తువ్వాయిల్లారా” (రచన-కొసరాజు, సంగీతం-మాస్టర్ వేణు) ఇప్పటికీ నాకు ఇష్టమైన పాట. సుశీలగారి ఎక్స్‌ప్రెషన్స్ గాత్రంలో అద్భుతం. “జాలిలేని నర పశువుల కన్నా - మీరే మేలనిపిస్తారు” అనే చోట సుశీలగారు పాడిన తీరు అనితర సాధ్యం.

తమ భావాన్ని అద్భుతంగా పలికించగల గాయకులకన్నా, రచయితలకీ, సంగీత దర్శకులకీ ఇంకేం కావాలి?

తెలుగువారి 'జాతి సంపద'లో సుశీల ఒకరు. ఆమె మన తెలుగు ఆడపడుచు అని చెప్పుకోవడం నిజంగా మన జాతికి గర్వ కారణం. మరిన్ని పాటలు చూడండి.

1. 'ఆడేపాడే పసివాడా' (చిత్రం–పెళ్లి కానుక, రచన–చెరువు ఆంజనేయశాస్త్రి, సంగీతం–ఎ.ఎం.రాజా)
2. 'వీణా.. పాడవే రాగమయీ (చిత్రం–సీతారామ కల్యాణం, రచన సీనియర్ సముద్రాల, సంగీతం–గాలి పెంచెల)
3. 'పాల కడలిపై శేష తల్పమున' (చిత్రం–చెంచులక్ష్మి, రచన–సీనియర్ సముద్రాల, సంగీతం–ఎస్. రాజేశ్వరరావు)
4. 'జయ జయ జయ శారద' (చిత్రం–మహాకవి కాళిదాసు, రచన–సీనియర్ సముద్రాల, సంగీతం–పెండ్యాల)
5. 'మేలిమి బంగరు మెలిక తిరిగినా' (చిత్రం–కలసి ఉంటే కలదు సుఖం, రచన–ఆరుద్ర, సంగీత–మాస్టర్ వేణు)
6. 'అడుగడుగున గుడి ఉంది' చిత్రం ఉండమ్మా బొట్టు పెడతా, రచన–దేవులపల్లి, సంగీతం–కె.వి. మహదేవన్)
7. 'మనసే అందాల బృందావనం' (చిత్రం–మంచి కుటుంబం, రచన–ఆరుద్ర, సంగీతం–ఎస్.పి. కోదండపాణి)
8. 'మహాబలిపురం మహాబలిపురం' (చిత్రం–బాలరాజు కథ, రచన–ఆరుద్ర, సంగీతం–మహదేవన్)
9. 'పాడెద నీ నామమే గోపాలా' (చిత్రం–అమాయకురాలు, రచన–దాశరథి, సంగీతం–ఎస్. రాజేశ్వరరావు)
10. 'సోగ్గాడే చిన్ని నాయనా' (చిత్రం–ఆస్తిపరులు, రచన–కొసరాజు, సంగీతం–కె.వి. మహదేవన్)
11. 'ఏమని పాడెదను ఈ వేళ' (చిత్రం–భార్యాభర్తలు, రచన–శ్రీశ్రీ, సంగీత–ఎస్. రాజేశ్వరరావు)
12. 'నీ చెలిమీ నేడె కోరితిని' (చిత్రం–ఆరాధన, రచన–నార్ల చిరంజీవి, సంగీతం– ఎస్. రాజేశ్వరరావు)
13. 'మధురమైన గురు దీవెన' (చిత్రం–స్వర్ణమంజరి, రచన–సీనియర్ సముద్రాల, సంగీతం–ఆదినారాయణరావు)

14. 'అలిగిన వేళనే చూడాలి' (చిత్రం-గుండమ్మ కథ, రచన-పింగళి, సంగీతం-ఘంటసాల)
15. 'సఖియా వివరించవే' (చిత్రం-నర్తనశాల, రచన-సీనియర్ సముద్రాల, సంగీతం-సుసర్ల దక్షిణామూర్తి)
16. 'వినిపించని రాగాలే - కనిపించని అందాలే (చిత్రం-చదువుకున్న అమ్మాయిలు, రచన-దాశరథి, సంగీతం-ఎస్. రాజేశ్వరరావు)
17. 'కనులు తెరిచినా నీవాయె' (చిత్రం-గుండమ్మకథ, రచన-పింగళి, సంగీతం-ఘంటసాల)
18. 'దాచాలంటే దాగదులే' (చిత్రం-లక్షాధికారి, రచన-సి.నా.రె., సంగీతం-టి. చలపతిరావు)
19. 'పాడమని నన్నడగవలెనా' (చిత్రం-డాక్టర్ చక్రవర్తి, రచన-ఆత్రేయ, సంగీతం-ఎస్. రాజేశ్వరరావు)
20. 'నిను చేర మనసాయెరా' (చిత్రం-బొబ్బిలియుద్ధం, రచన-శ్రీశ్రీ, సంగీతం-ఎస్. రాజేశ్వరరావు)
21. 'రివ్వున సాగే... రెపరెపలాడే (చిత్రం-మంగమ్మ శపథం, రచన- సి.నా.రె., సంగీతం-టి.వి. రాజు)
22. 'జయ పాండురంగ ప్రభో విఠలా' (చిత్రం-సతీ సక్కుబాయి, రచన-సీనియర్ సముద్రాల, సంగీతం-పి. ఆదినారాయణరావు)
23. 'నీల మోహన రారా' (చిత్రం-డాక్టర్ ఆనంద్, రచన-దేవులపల్లి, సంగీతం-కె.వి. మహదేవన్)
24. 'మీరజాలగలడా నా యానతి (చిత్రం శ్రీకృష్ణ తులాభారం, రచన-స్థానం నరసింహారావు, సంగీతం-పెండ్యాల)
25. 'జీవము నీవే కదా దేవా' (చిత్రం-భక్త ప్రహ్లాద, రచన-సీనియర్ సముద్రాల, సంగీతం-ఎస్. రాజేశ్వరరావు)
26. 'తిరుమల మందిర సుందరా' (చిత్రం-మేనకోడలు, రచన-దాశరథి, సంగీతం-ఘంటసాల)
27. 'నీ మది చల్లగా' (చిత్రం-ధనమా!దైవమా!, రచన-సి.నా.రె., సంగీతం-టి.వి. రాజు)
28. 'శ్రీరామ నామాలు శతకోటి' (చిత్రం-మీనా, రచన-ఆరుద్ర, సంగీతం-రమేష్ నాయుడు)
29. 'వస్తాడు నా రాజు ఈ రోజు' (చిత్రం-అల్లూరి సీతారామరాజు, రచన-సి.నా.రె., సంగీతం-పి. ఆదినారాయణరావు)





30. 'రాధకు నీవేరా ప్రాణం' (చిత్రం-తులాభారం, రచన-రాజశ్రీ, సంగీతం-సత్యం)
31. 'మ్రోగింది వీణ ... పదే పదే' (చిత్రం-జమీందారుగారి అమ్మాయి, రచన-దాశరథి, సంగీతం-జి.కె. వెంకటేష్)
32. 'తెల్లావారక ముందే పల్లె లేచింది' (చిత్రం-ముత్యాలపల్లకి, రచన-మల్లెమాల, సంగీతం-సత్యం)
33. 'వటపత్ర శాయికి వరహాల లాలి' (చిత్రం-స్వాతిముత్యం, రచన-సి.నా.రె., సంగీతం-ఇళయరాజా)
34. 'నిన్నటి దాకా శిలనైనా' (చిత్రం-మేఘసందేశం, రచన-వేటూరి, సంగీతం- రమేష్ నాయుడు)
35. 'పాడనా తెలుగు పాట' (చిత్రం-అమెరికా అమ్మాయి, రచన-దేవులపల్లి, సంగీతం-జి.కె. వెంకటేష్)
36. 'ఎవరు నేర్పేరమ్మ ఈ కొమ్మకు' (చిత్రం-ఈనాటి బంధ ఏనాటిదో, రచన-దేవులపల్లి, సంగీతం-ఎస్. రాజేశ్వరరావు)
37. 'జోరు మీదున్నావు తుమ్మెద' (చిత్రం-శివరంజని, రచన-దాసం గోపాలకృష్ణ, సంగీతం-రమేష్ నాయుడు)
38. 'గోరింట పూచింది కొమ్మ లేకుండా' (చిత్రం-గోరింటాకు, రచన-దేవులపల్లి, సంగీతం-కె.వి. మహదేవన్)
39. 'ఆకులో ఆకునై' (చిత్రం-మేఘసందేశం, రచన-దేవులపల్లి, సంగీతం-రమేష్ నాయుడు)
40. 'అనురాగము విరిసేనా' (చిత్రం-దొంగరాముడు, రచన-సీనియర్ సముద్రాల, సంగీతం-పెండ్యాల)

ఇలా ఎన్ని వందల పాటలో! గుండెల్లోంచి వూరి పొంగి వస్తున్నాయి. ప్రతి పాటనూ వైవిధ్యభరితంగానే పాడారు సుశీలగారు. ఏ పాట మాధుర్యం ఆ పాటదే. ఏ పాట నడక ఆ పాటదే. స్వరకర్త స్వరాలకూ, గీత రచయితల పదాలకూ మెరుగు పెట్టి వన్నెలద్దిన గాత్రం సుశీలగారిది. రచనల్ని విశ్లేషించి డాక్టరేట్లు పొందుతారు. గళాల్ని విశ్లేషించే సబ్జెక్టు యూనివర్సిటీలో ఉంటే, యీపాటికి సుశీలగారి పేరు మీద కనీసం వెయ్యి రీసెర్చ్ లు జరిగి ఉండేవి.

ఈ పాటలైనా ఎందుకు ఉదాహరించానంటే మళ్ళీ మీ ద్వారా వింటారనీ! వీలుంటే అన్నిటినీ సిడిల రూపంలో దాచుకుంటారనీ! సుశీలగారి పాటలని విశ్లేషించడానికి, ఆ

మాధుర్యం వర్ణించడానికి వేయి నాలుకలూ, లక్ష కలాలూ చాలవు. అనుభూతించే హృదయం ఉంటే మాత్రం అనంతమైన, అరుదైన, అద్భుతమైన ఆనందాన్ని అనుభవిస్తారని మాత్రం నిస్సందేహంగా చెప్పగలను.

అమ్మ, శ్రీమతి సుశీలమ్మ ఆయురారోగ్య, ఐశ్వర్యాలతో నిండు నూరేళ్ళు వర్ధిల్లాలనీ, వారూ వారి కుటుంబం ఆ సంగీత సరస్వతి సమక్షంలో నిరంతరం తరించాలనీ మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

మొన్నీ మధ్యే జరిగిన ఓ సంఘటన చెప్పక తప్పదు. శ్రీ ఇళయరాజాగారిని కలవడానికి సుశీలగారు, చి. వేణు, నేనూ ప్రసాద్ పాత స్టుడియోకి వెళ్లాం. వారు సుశీలమ్మ పాదాలకి నమస్కరిస్తే, సుశీలగారు ఇళయరాజాగారి పాదాలకు నమస్కరించారు. నా కళ్ళు గంగాయమునలయ్యాయి. ఇద్దరు సంగీత సరస్వతులు ఒకరినొకరు వినయంతో, విజ్ఞతతో ఎలా గౌరవించుకుంటారో ఆనాడు నేను ప్రత్యక్షంగా చూశాను. వారు చేసుకున్న నమస్కారములు సంగీత సరస్వతికి చేసిన సపర్యలు. సాహిత్య సరస్వతికి చేసిన అలంకారాలు.

"The end of education is character - అన్నారు పెద్దలు. ఆ మాటలకు నిలువెత్తు నిదర్శనం సుశీలగారు.

అన్నట్టు ప్రతి నవంబరు 19న పుట్టపర్తిలో "సాయి సుప్రభాతం" ఆలపించేది సుశీలగారే! దేశంలో ఏ రోజు ఎక్కడ ఉన్నా ఆ రోజు మాత్రం పుట్టపర్తిలో సుశీలమ్మగారు ఉంటారు. దశాబ్దాలుగా ఈ కార్యక్రమం జరుగుతోంది. పదిహేను సంవత్సరాల నుంచీ నేనే ప్రత్యక్ష సాక్షిని.

తెలుగు భాషకి. తెలుగు జాతికి అద్భుతమైన, అసమానమైన, అపూర్వమైన సేవ చేసిన కీ. శే. మండలి వెంకట కృష్ణారావుగారి "తెలుగు వైభవ పురస్కారా"న్ని అమ్మలగన్న అమ్మ మన పి. సుశీలమ్మగారు అందుకోబోతున్న శుభసందర్భంలో వారికీ, పురస్కారాన్ని అందజేస్తున్న తండ్రికి తగ్గ తనయుడు, తెలుగుజాతి ముద్దుబిడ్డ, గొప్ప తెలుగుభాషా సేవకుడూ, వక్త, మచ్చలేని స్వచ్ఛ రాజకీయ నాయకుడు, అన్నిటినీ మించి అమృత హృదయుడూ, మన ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికీ మనస్ఫూర్తిగా నమస్కరిస్తూ, శుభాకాంక్షలను అందజేస్తూ, ఈ కార్యక్రమం దిగ్విజయంగా జరగాలనీ, కలకాలం ప్రజల హృదయాలలో నిలిచిపోవాలనీ ఆకాంక్షిస్తున్నాను.







# పి. సుశీల పాట పీయూష కలశమ్ము

- జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు

సీ. భక్తి గీతాలకున్ భగవంతుడే మెచ్చి
వచ్చి దర్శనమిచ్చి వరములొసగు
ప్రకృతి గీతాలకున్ పరవశమొందుచున్
సకల ప్రకృతి యెల్ల సంతసించు
అనుబంధ గీతాల నాలాపనము సేయ
ప్రేమానురాగాలు వెల్లి విరియు
వలపు గీతాలకున్ విలువలు వెలయుచున్
మమతతో హృదయాలు మధురమౌను

ఆ.వె. పీ సుశీల పాట పీయూష కలశమ్ము
స్వరము పదము తెలుగు జాతి సొమ్ము
కృష్ణమూర్తి నపుడు తృటిలోన తూచిన
తులసి దళము ఆమె గళము, నిజము.





శ్రీమతి ఇందిరాగాంధీతో శ్రీమతి పి. సుశీల



ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు నుంచి నంది అవార్డు స్వీకరిస్తున్న శ్రీమతి పి. సుశీల




నాటి మేటి సినీ కళాకారులు శ్రీమతి గీతాంజలి, శ్రీమతి అన్నపూర్ణ, శ్రీమతి కృష్ణవేణి, శ్రీమతి జమున, శ్రీమతి శారద, శ్రీమతి షావుకారు జానకి, శ్రీమతి కె.ఆర్. విజయ, శ్రీమతి రోజారమణి, శ్రీమతి పి. సుశీల, శ్రీమతి రమాప్రభలతో శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు మరియు శ్రీ కె.వి. రమణాచారి గారు.

24





# 'సంగీత సరస్వతి' సుశీల

పద్మశ్రీ, 'కళాప్రపూర్ణ'
**– డా॥ తుర్లపాటి కుటుంబరావు**

ఎంత పారవశ్యం ఆ పాటలో!
ఎంత మాధుర్యం ఆ గళంలో!
పి. సుశీల!
ఆమె తెలుగువారి అదృష్టం! ఆమె తెలుగు ఆడపిల్లలు కలలు కనే గళం!

ఆ గళం ప్రతిరోజూ మన చెవినపడి, మనస్సుకు స్వాంతన కలిగించే ఛందనం! ఆమె పాటలో ఒక జాతి సంస్కారం ఉంది. ఒక్క మాటలో – తెలుగు సినీ సంగీతమంతా సుశీలమయం!

విజయనగరం సంగీతానికి, రాజమహేంద్రవరం సాహిత్యానికి పుట్టిళ్ళు అంటారు. ఈ "సంగీత సరస్వతి పుట్టింది విజయనగరంలోనే 1935, నవంబరు 13న. తండ్రి ముకుందరావు లాయరే కాదు – కళాకారులు కూడా. ఆయనకు శాస్త్రీయ సంగీతం, వీణా వాదనం చాలా ఇష్టం. మాతృమూర్తి శేషావతారంగారికి సంగీతమంటే ప్రాణం.

అందువల్ల, సుశీలకు కూడా పుట్టుకతోనే అబ్బింది సంగీత ప్రియత్వం. విజయనగరం సంగీత కళాశాలలో "కళాప్రపూర్ణ" ద్వారం వెంకట స్వామినాయుడుగారి శిష్యరికం. "గాన గంధర్వుడు" ఘంటసాల వారికి కూడా ద్వారం వారి శిష్యరికమే సంగీత సరస్వతి ముద్దు బిడ్డ చేసింది.

విజయనగరం సంగీత కళాశాలలో గాత్ర సంగీతంలో డిప్లొమా సాధించిన తరువాత సుశీల గాత్ర మాధుర్యం కోసం ఆంధ్రదేశంలో ఊరూరు చెవులు రిక్కించి ఎదురు చూసింది.

పెండ్యాల సంగీత దర్శకత్వంలో 1953లో వచ్చిన "కన్నతల్లి" సుశీల పాడిన తొలి చిత్రం. అక్కడి నుంచి ఆమె సినీ సంగీత జీవితం వెనుతిరిగి చూసింది లేదు.

1955లో వచ్చిన "మిస్సమ్మ", 1957లో వెలువడిన "మాయాబజార్", 1959నాటి "అప్పుచేసి పప్పు కూడు" మొదలైన విజయా వారి చిత్రాలు సంగీత సరస్వతికి కంఠాభరణాలు.

ముఖ్యంగా "మాయాబజార్" చిత్రంలో మాయా శశిరేఖకు పాడిన "అహ నా పెళ్ళంట" పాట ఇప్పటికీ సుశీల సినీ సంగీత కిరీటంలో ఒక మణిపూస. ఈ సాత్విక గాయనీమణి నోట అంతటి కవ్వింపు కొంటె పాత ఎలా వచ్చిందా? అని అందరికీ ఆశ్చర్యమే!

ఔను, మరి! "పాడమని నన్నడగవలెనా, పరవశించి పాడనా!" వంటి సాత్విక గీతాలకే అలవడిన ఆ గొంతు ఏ రసమైనా పలికించగలదనిపించింది.

ఒకటా, రెండా? తెలుగు, తమిళ, కన్నడం, మలయాళం, హిందీ, ఒరియా, సింహళ భాషల ఏడింటిలో ఆమె దాదాపు 16 వేల సినీ గీతాలను గానం చేశారు. ఆమె సినీ సంగీత జీవిత రజతోత్సవం సందర్భంగా హైదరాబాద్ నిజాం గ్రౌండ్స్ లో జరిగిన బ్రహ్మాండమైన సన్మాన సభలో ఈ గాంధర్వ గాయనికి "సంగీత సరస్వతి" బిరుదు ప్రదానం జరిగింది. ఆమెకు ఆరుగురు రాష్ట్రపతులు సన్మానాలు చేశారు. లతా మంగేష్కర్ తరువాత అత్యధిక సినీ గీతాలు గానం చేసిన ఘనత ఈ సంగీత సరస్వతిదే.

ఆమెకు సన్మానాలు, సత్కారాలకేమి తక్కువ! భారత ప్రభుత్వం ఆమెకు "పద్మభూషణ్" ప్రదానం చేసింది.

పాటే ఆమెకు ప్రాణం. సంగీతమే తన జీవన సర్వస్వమంటారామే.

ఎనిమిది పదులు దాటినా, ఆమె స్వర మాధుర్యం తరగలేదు. కాని, ఇటీవల ఆధ్యాత్మిక చింతనలో పడిన తరువాత ఆమె సినీ గీతాలకు దూరమైనారు. దాదాపు మూడు దశాబ్దాల పాటు సుశీల దక్షిణభారత సినీ సంగీత సామ్రాజ్ఞి.



**రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ ఎదుట నాట్యం చేస్తున్న కుమారి జయలలిత, గానం చేస్తున్న శ్రీమతి పి. సుశీల**





# తెలుగు జాతి సంపద శ్రీమతి పి. సుశీల

- సంజయ్ కిషోర్
సినీ పరిశోధకులు
సెన్సార్ బోర్డ్ పూర్వ సభ్యులు
ఆం.ప్ర. ప్రభుత్వ ఉగాది పురస్కార గ్రహీత
సెల్: 98480 91917

గురుతుల్యులు మండలి బుద్ధప్రసాద్ గారిని ఈ మధ్య కలిసినప్పుడు మాటల్లో వారి నాన్నగారైన మండలి వెంకట కృష్ణారావు గారి జన్మదినం సందర్భంగా ఈ సంవత్సరమే ఏర్పాటు చేసిన మండలి వెంకట కృష్ణారావు తెలుగు వైభవ పురస్కారాన్ని ప్రఖ్యాత గాయని శ్రీమతి పి. సుశీల గారికి ఇస్తున్నట్లు చెప్పారు. తెలుగువారి అభిమాన గాయనికి మరో విలువైన పురస్కారం వరిస్తుందన్న ఆనందంతో మనసు నిండిపోయింది. అందులోనూ కీ॥శే॥ మండలి వెంకట కృష్ణారావు గారు, వారి తనయులు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు ఇద్దరూ మన భాష, సంస్కృతుల అభ్యున్నతికి ఎల్లవేళలా కృషి చేసిన, చేస్తున్న మహనీయులు. అటువంటి మండలి వెంకట కృష్ణారావు గారి పేరుపై నెలకొల్పిన పురస్కారాన్ని తెలుగు భాష తియ్యదనాన్ని తన పాట ద్వారా ప్రపంచానికి తెలియపర్చిన సుశీలగారికి ఇవ్వడం నిజంగా నూటికి నూరుపాళ్ళు సమంజసం!

దేశభాషలందు తెలుగు లెస్స అని శ్రీ కృష్ణదేవరాయలు, సుందర తెలుంగు అని ప్రఖ్యాత తమిళకవి శ్రీ సుబ్రహ్మణ్యభారతి గార్లు తెలుగు భాషని వివిధ సందర్భాలలో కీర్తించారు. కాని ఇదంతా గత వైభవమని చెప్పుకోవాలేమో! ఈ తరానికి తెలుగు చదవడం, రాయడం దాదాపు రాదు. మాట్లాడడం వరకే! మాట్లాడినా ఒత్తులు పలకవు. ఇక 'ళ', 'ణ' లను 'ల', 'న' లుగా పలుకుతున్నారు. ఉదాహరణకి పెళ్ళిని, పెల్లిగా, 'మళ్ళీ మళ్ళీ'ని 'మల్లీ మల్లీ' గా 'తెలంగాణ' ని 'తెలంగాన' గా ఇలా ఎన్నో పదాలు వాటి సహజ శబ్దసౌందర్యాన్ని కోల్పోయి నత్తిబాట పడుతున్నాయి. ఇటువంటి పరిస్థితులలో తెలుగును తెలుగుగా ఎలా పలకాలి అని ఎవరైనా తెలుసుకోవాలన్నా, తెలుగు ఉచ్చారణలోని మాధుర్యాన్ని ఆస్వాదించాలన్నా, ఒత్తులు ఎగిరిపోని నిండైన తెలుగును విన్నాలన్నా సుశీల గారి పాట వింటే చాలు. మన తెలుగు యొక్క అందం, సొగసు, గొప్పదనం సంపూర్ణంగా ఆవిష్కృతమౌతాయి.

సుశీల గారిది తియ్యటి గొంతు. ప్రయత్నించి సాధన చేస్తే వచ్చిన గొంతు కాదది. భగవత్ ప్రసాదం! ఏది పాడినా తీయగా ఉంటుంది. వినడానికి హాయిగా ఉంటుంది. ఆ గొంతు పలకని సంగతి లేదు. పాడని రకమూ లేదు. రాగ భావమే గాకుండా అర్ధ భావము కూడా తెలుసుకుని పాడేవారు. ఏ కథానాయికకు పాడినా వారే స్వయంగా పాడారా అని భ్రమ కలిగించేలా ఉండేది. అయితే ఎవరి గొంతుకు తగ్గట్లుగా వారి గొంతును మిమిక్రి చేసేవారు





కాదు. వాళ్ళ వాళ్ళ ఉచ్చారణశైలిని దృష్టిలో పెట్టుకుని, పాత్ర స్వభావాన్ని, పాడే సందర్భాన్నీ తెలుసుకుని పాడేవారు. అందువల్లే ఆయా కథానాయికలే పాడుతున్నట్లు మనకు అనిపించేది. ప్రణయగీతాలైనా, విరహ గీతాలైనా, విషాద గీతాలైనా, వీణ పాటలైనా, జానపదాలైనా, జయదేవుని అష్టపదులైనా... ఏదైనా... ఎటువంటిదైనా సుశీల గారు పాడితే కొత్త అందం వచ్చి తీరాల్సిందే!

1935వ సంవత్సరంలో కళలకి కాణాచిగా పేరొందిన విజయనగరంలో పుట్టిన సుశీలగారు 1953లో విడుదలైన 'కన్నతల్లి' సినిమాతో గాయనిగా తెలుగులోకానికి పరిచయమయ్యారు. తొలి చిత్రంలో ఉపపాత్రధారులకి పాడిన సుశీలగారు రెండో చిత్రం 'పక్కింటి అమ్మాయి' లోనే నాటి టాప్ కథానాయికలలో ఒకరైన అంజలీదేవికి పాడారు. అది మొదలు 1990ల వరకు ఆ గళానికి అలుపూ లేదు, విశ్రాంతి లేదు. తెలుగు, కన్నడ, మళయాళ భాషల్లో అగ్రేసర గాయనిగా కొనసాగిన సుశీలగారు కొన్ని హిందీ, ఒరియా, సింహళం పాటలు కూడా పాడారు. పాడిన మొత్తం పాటలు ఇరవైవేల వరకు ఉంటాయని అంచనా. ఒక్క తెలుగులోనే దాదాపు ఏడు వేల పాటలు పాడారు.

సుశీలగారనగానే కొన్ని హిట్ సాంగ్స్ గుర్తుకురావడం సహజం. వాటినే నేను మళ్ళీ ప్రస్తావించదలుచుకోలేదు. ఇంకా ఎన్నో గీతాలు ఆమె నోటి నుండి జాలువారి అమృతగుళికలయ్యాయి. 'మోహినీ భస్మాసుర' చిత్రంలో మోహిని పాత్రధారి పద్మిని 'నేను నేనే సుమా' అనే పాట పాడుతుంది. రాగాలాపనతో కూడిన ఆ పాట పాడటం అంత తేలిక కాదు. కాని గొంతు తిరిగిన గాయని కదా...హాయిగా పాడేసి 'నేను నేనే సుమా' అనిపించారు శ్రీమతి పి.సుశీల. 'గుండమ్మకథ' లో 'సన్నగ వీచే చల్లగాలికి' పాటలో మొదట్లో చల్లగాలి అనే మాట పలుకుతున్నపుడు 'గాలి' పదం దగ్గర చల్లని గాలి తెరలు తెరలుగా వస్తున్నట్లు ఆమె వేసిన సంగతులు విని ఆనందించవలసినదేగాని వర్ణనకు సాధ్యం కాదు. అమ్మ కడుపు చల్లగా (సాక్షి), చిన్నారి పైడి బొమ్మ (అమాయకురాలు), నిదురపోరా బాబు నిదురపోరా (అంగడి బొమ్మ), ప్రేమకు నేను పేదనుకాను (ముందడుగు) వంటి పాటలు ఎంత పాపులరన్నమాట పక్కన పెడితే సుశీల గారి గొంతు కోసం ఆ పాటల్ని వినాలి. ఆ స్వరం యొక్క తియ్యదనంలో మనం మునకలేయకుండా ఉండలేం! కుశలమా నీకు కుశలమేనా (బలిపీఠం) వంటి డ్యూయెట్స్‌లో ఆ గొంతు రసికత పలికితే, జయపాండురంగ ప్రభో విఠలా (సతీ సక్కుబాయి) పాటలో భక్తి రసం చిలుకుతుంది. ఏ దేశమేగినా (అమెరికా అబ్బాయి) పాట మనలో దేశభక్తిని రగిలిస్తే..నిదురించే తోటలోకి (ముత్యాల ముగ్గు) పాట మనలో ఆర్ద్రత నింపుతుంది. ఇక లవకుశ, భక్త ప్రహ్లాద వంటి పౌరాణిక చిత్రాల్లో పాటలు, పద్యాలు ఎంత గొప్పగా ఆలపించారో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. తెలుగులో పద్యాలని అంత కమ్మగా ఆలపించే మరో గాయని వస్తుందా అంటే సందేహమే!! ఇలా ఆ సంగీత సరస్వతి యొక్క గాన ప్రతిభ గురించి రాసుకుంటూపోతే ఓ గ్రంథమే రాయొచ్చేమో!!





అలా నలభై ఏళ్ళు పాటు దక్షిణ భారతదేశాన్ని తన పాటతో ఉర్రూతలూపిన సుశీల గారు సినీ నేపథ్య రంగాన్ని ఒక విధంగా ఏలారని చెప్పొచ్చు. సుశీల గారు ఫీల్డులో కొచ్చేసరికి అగ్రేసర గాయనీమణులుగా వెలుగొందుతున్న పి. లీల, జిక్కీ లు సుశీలగారి ప్రభంజనానికి కొంత వెనక్కు తగ్గక తప్పలేదు. సుశీలగారు వచ్చిన ఐదేళ్ళ తర్వాత ఫీల్డు కొచ్చిన ఎస్. జానకిగారు కూడా 1970ల రెండో భాగంలో గానీ అగ్రేసర గాయనిగా కుదురుకోలేదు. అంతగా తెలుగు, తమిళంలలో సుశీలగారి హవా నడిచేది.

నా ఇంటర్‌మీడియట్ రోజుల్లో మద్రాస్ ఏ.వి.యం. స్టూడియోలో తలవని తలంపుగా సుశీలగారి రికార్డింగ్ వినే భాగ్యం కలిగింది. అప్పటికే ఆమె పాడటం కొంత తగ్గింది. చిత్ర తరం ప్రారంభమైంది. అయినా నాకు ఇష్టమైన సుశీలగారి రికార్డింగ్ అనగానే ఏదో తెలియని ఆనందం. ఎప్పుడొస్తారని పక్కవాళ్ళని అడిగితే మూడింటికి అన్నారు. కరెక్టగా మూడింటికి వచ్చారు సుశీలగారు. పాటని పాడటానికి రెండు, మూడు గంటలైనా తీసుకుంటారేమో అనుకున్నాను. 40 నిముషాలలో పాడి వెళ్ళిపోయారు. టైంకు రావడం, వచ్చినప్పటి నుంచి పాట నేర్చుకోవడం పైనే దృష్టిని కేంద్రీకరించటం, సంగీత దర్శకుడు చెబుతున్న సంగతులను ఇట్టే గ్రహించగలగటం, స్పష్టమైన ఉచ్ఛారణ, అద్భుతమైన భావప్రకటన, తక్కువ టైంలో పాటని పాడేయగల నైపుణ్యం, వచ్చిన పనిమీద తప్పితే ఇతరత్రా విషయాలపై ధ్యాస పెట్టకపోవడం, అందరితో సఖ్యతగా ఉండటం, ఏ వయసు వారితోనైనా ఏ స్థాయి వారితోనైనా మర్యాదతో మసులుకోవడం ఇవన్నీ పరిశీలించిన నాకు సుశీల గారిపై ఉన్న అభిమానం రెట్టింపయ్యింది. ఇన్ని సుగుణాలు ఉండబట్టే ఆమె అంత పెద్ద గాయని అయ్యారేమోననిపించింది.

గాయనిగా ఇంత అనుభవం ఉన్నా సంగీత దర్శకత్వం వైపు దృష్టి సారించేవారు కాదు. మహానటి సావిత్రి గారు మహిళా టెక్నీషియన్స్‌తో సినిమా తీయదలచి 'చిన్నారిపాపలు' చిత్రానికి సంగీత దర్శకత్వం వహించమని సుశీలగారిని అడిగారు. 'సంగీత దర్శకత్వం వహించేంతటి జ్ఞానం నాలో లేదు' అని సున్నితంగా తిరస్కరిస్తూనే... 'సంగీతంపై మంచి పట్టున్న గాయని పి. లీల గారు ఈ పనికి కరెక్ట్. వారితో చేయిస్తే బాగుంటుంది' అని తన సాటి గాయనికి ఆ అవకాశం ఇప్పించిన సహృదయురాలు శ్రీమతి సుశీల. అలాగే రోజుకి పది పాటలు, పదిహేను పాటలు పాడేదాన్ని అని లేని గొప్పలు ఎప్పుడూ చెప్పేవారు కాదామె. 'నేను రోజూ నాలుగు షిప్టులు మాత్రమే పనిచేసేదాన్ని అంటే నాలుగు పాటలకు మించి పాడగలిగేదాన్నికాదు' అని నిజాయితీగా చేప్పేవారు శ్రీమతి పి. సుశీల.

సుశీలగారిపై ఇంటర్వ్యూలు, వ్యాసాలు రాయడం, మా 'సంగమం' సంస్థ నిర్వహించిన అనేక కార్యక్రమాలలో వారు పాలుపంచుకోవడం, వారిని వివిధ సందర్భాలలో మేము సత్కరించడం, అలాగే వారు నెలకొల్పిన 'పి. సుశీల ట్రస్ట్' ఆంధ్రప్రదేశ్‌లో నిర్వహించిన



శ్రీ సంజయ్ కిషోర్, శ్రీమతి లతామంగేష్కర్, శ్రీమతి పి. సుశీల

కార్యకలాపాలను నేను చూసుకోవడం – వీటన్నిటి వల్ల ఆ మహాగాయనితో దాదాపు రెండు దశాబ్దాలుగా సన్నిహిత పరిచయం ఉండటం నా అదృష్టం !

'పద్మభూషణ్' వచ్చిన సందర్భంగా తన మానసిక గురువు, తనెంతగానో ఆరాధించే గాయని 'భారతరత్న' లతామంగేష్కర్ గారిని కలిసి ఆశీస్సులు తీసుకోవడానికి ముంబాయి వెళ్ళారు సుశీల గారు. వారితో పాటు నేనూ వెళ్ళాను. లతామంగేష్కర్‌గారు, సుశీలగారు ఇద్దరూ జరీఅంచు ఉన్న తెలుపు లేదా హాఫ్ వైట్ పట్టుచీరలే కడతారు. అది వాళ్ళ ట్రేడ్ మార్క్. అయితే లతగారి ఇంటికెళ్తున్నప్పుడు సుశీలగారు తన సహజశైలికి భిన్నంగా డార్క్ పింక్ కలర్ శారీని కట్టుకున్నారు. అదేంటి తెలుపు కాకుండా ఈ కలర్ కట్టుకున్నారు ఈవేళ అని అడిగాను. అప్పుడామె 'ఏం లేదయ్యా... లత గారు వయసులో, అనుభవంలో నా కంటే పెద్ద. నా మానసిక గురువు. తెలుపురంగు పట్టుచీర కట్టి 'మన ఇద్దరమూ ఒకటే' అనే భావం వచ్చేలా ఆమె ముందు ప్రవర్తించినట్లుంటుంది. ఆమె ఆమే. ఆ తెల్ల పట్టుచీర ప్రత్యేకతని ఆమెకే వదిలేద్దాం. అందుకే ఈ వేళ ఈ రంగు చీర కట్టుకున్నాను' అని ఆమె వివరించినప్పుడు పెద్దలంటే ఆమెకున్న గౌరవం, ఆమె ఆలోచనా విధానం లోని వినయం నాకు స్పష్టంగా అర్థమైంది.

ఇక లతా మంగేష్కర్ గారి ఇంటికి చేరుకున్నాం. అక్కడ కొంతమంది లతగారి బంధువులు ఉన్నారు. వారంతా దక్షిణాదిలో వివిధ ప్రదేశాలలో ఉంటారట. వారంతా

సుశీలగారు వస్తున్నారు చూద్దామని వచ్చారట! నాకు ఎంతో ఆశ్చర్యమేసింది. లతగారింట్లో సుశీల గారికి ఫాన్సా అని! వారు సుశీలగారిని చూడగానే మురిసిపోయి ఆమె పాడిన తమిళ, కన్నడ సాంగ్స్ గురించి పొగుడుతూ చెబుతుంటే ఆనందంతో అలా చూస్తూ ఉండిపోయాం. ఆ సందర్భంలో లతాగారు సుశీల గారి గురించి చెబుతూ 'హిందూస్థాన్‌లో నేను చాలా మంది గాయనీమణులను చూసాను కాని పి. సుశీల లాంటి గాయనీమణిని చూడలేదు. సినిమా పాటలకు ఆమె స్వరం ఓ వరం. నాకు మంచి మిత్రురాలు. మేము నలుగురం అక్కాచెల్లెళ్ళం. ఐదో సోదరిగా సుశీలగారిని మేమంతా భావిస్తాం' అని సుశీలగారిపై తనకున్న అపార గౌరవాన్ని వెలిబుచ్చారు. అఖిల భారతస్థాయిలో సంగీత ప్రపంచపు రారాణిగా వెలుగొందుతున్న లతామంగేష్కర్ గారి హృదయంలో మన సుశీల గారికి అంత గొప్ప స్థానం ఉండటం సుశీలగారి గాన ప్రతిభ, ఉత్తమ వ్యక్తిత్వానికి నిదర్శనమని చెప్పాలి!

పి. సుశీల ట్రస్టు ద్వారా 'పి. సుశీల నేషనల్ అవార్డు'ను ప్రతియేటా ఇవ్వాలని నిర్ణయించినప్పుడు తొలి అవార్డును ఎవరికివ్వాలీ అని అందరం కూర్చుని చర్చ ప్రారంభించాం. ఎస్. జానకి గారికిస్తే ఎలా ఉంటుందని తటాపాయిస్తూ సుశీలగారి వంక చూసాము. ఒకరంటే ఒకరికి ఏమన్నా ప్రొఫెషనల్ జెలసీ ఉంటుందేమో బహుశా ఒప్పుకోరేమో అని సందేహించాము. కాని సుశీలగారు వెంటనే 'కరెక్ట్. జానకే నా తొలి అవార్డుకు అర్హురాలు. ఆమెకే ఇద్దాం' అని జానకి గారికే తొలి అవార్డును ప్రకటించారు. సుశీల గారి సహృదయతకి, ఔన్నత్యానికి ఇదో నిదర్శనం.

అనారోగ్య, ఆర్థిక కారణాలతో సతమతమవుతున్న ప్రముఖ సంగీత దర్శకులు శ్రీ జె.వి. రాఘవులు గారికి మా 'సంగమం' సంస్థ ఓ ప్రత్యేక కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తే సుశీల గారు ముఖ్య అతిథిగా రావడమే గాకుండా అప్పటికప్పుడు యాభైవేల రూపాయలను ఆయనకు బహూకరించారు. అలాగే గాయని శ్రీమతి ఉడుతా సరోజినీ గారికి కూడా మేము ఏర్పాటు చేసిన సత్కార కార్యక్రమానికి విచ్చేసి ఆమె అనారోగ్యంతో ఇబ్బంది పడుతున్నారని తెలిసి వెంటనే లక్ష రూపాయలను సరోజినీ గారికి బహూకరించి తన సహృదయతను చాటుకున్నారు. నలుగురికి తన చేతనైన సహాయం చేయడం ఈ మహాగాయని జీవగుణం.

సుశీలగారు చెవులకి రింగులు పెట్టుకుంటారు. మా అమ్మగారూ రింగులే పెడతారు. ఒకసారి సుశీలగారు పెట్టుకున్న రింగుల మోడల్ నచ్చి అటువంటివి చేయించుకుందామని మా అమ్మగారు హైదరాబాద్‌లో ఉన్న నగల దుకాణాలన్నింటికీ తిరిగారు. కాని అదే మోడల్ దొరకలేదు. ఓ సందర్భంలో కలిసినప్పుడు మా అమ్మగారు సుశీలగారిని అవి ఎక్కడ కొన్నారో అడిగారు. 'వీటికోసం ఇప్పుడు మీరు చెన్నై ఏం వస్తారమ్మా నేను చేయించి పంపుతాలే' అని సుశీలగారు అనడమే కాకుండా నిజంగానే కొద్ది రోజులలో చేయించి పంపారు. పాతికవేలు వరకు ఉంటాయవి. డబ్బులు పంపబోతే తీసుకోలేదు. మంచి

కొడుకును కన్నారు. నేను మీకిచ్చే చిరుకానుకగా భావించండి అని ఎంతో ఆప్యాయతని కురిపించారు. వారు చూపించిన అభిమానానికి మా అందరికీ నోటమాటలేదు. ఇవి సుశీల గారి సహృదయతకి మచ్చుక్కి కొన్ని ఉదాహరణలు!

ఇన్నేళ్ళ వారితో నాకున్న పరిచయంలో ఏ రోజూ ఆమెలో కోపాన్ని గానీ, చిరాకును గానీ, ఎవరిపైనైనా అరవడం గానీ చూడలేదు. ఎప్పుడూ చెరగని చిరునవ్వుతోనే ఉంటారు. చిన్నపిల్లల్లో చిన్నపిల్లై పోతారు. పెద్దల దగ్గర గౌరవంతో నడుచుకుంటారు. హాస్య చతురత ఎక్కువ. వారితో కలిసి ప్రయాణాలు చేస్తున్నప్పుడు నవ్వుతూనే ఉంటాము. జోక్స్ బాగా కట్ చేస్తారు. చుట్టూ ఉన్న వాతావరణాన్ని ఎప్పుడూ హాయిగా, సంతోషంగా, ఆహ్లాదంగా ఉంచుతారు.

ఏది ఏమైనా పాట అంటే సుశీల. సుశీల అంటే పాట. వారు పలకని సంగతి లేదు. అనలేని స్థాయిలేదు. అందుకోని గౌరవమూ లేదు. కేంద్రప్రభుత్వం వారిచే 'పద్మభూషణ్' తోనూ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే 'రఘుపతి వెంకయ్య' అవార్డుతోనూ, తమిళనాడు ప్రభుత్వం వారిచే 'కలైమామణి', 'అన్నా' వంటి అనేక పురస్కారాలతో గౌరవింపబడ్డారు. ఆమెకు కావాల్సినవేమీ లేవు. రావాల్సినవే ఉన్నాయి.

సుశీల లాంటి తియ్యటి గొంతుని అంతకు ముందు వినలేదు, ఇక ముందు వింటామన్న నమ్మకమూ లేదు. ఆ స్వరం నభూతో నభవిష్యతి....! ఒక్కమాటలో చెప్పాలంటే తెలుగు పాట సంతకం శ్రీమతి పి. సుశీల. ఆమె మన జాతి సంపద! మరి సంపదను కాపాడుకోవాల్సిన బాధ్యత, భవిష్యత్ తరాలకి అందించాల్సిన బాధ్యత మనందిరిపైనా... ముఖ్యంగా ప్రభుత్వాలపైన ఉంది. వారి పాటలన్నీ సేకరించి భవిష్యత్ తరాలకి అందించాలి. వారి పాటలని ముందు తరాలకి అందించడమంటే స్వచ్ఛమైన తెలుగు భాషను అందించడమే!!!





శ్రీమతి జయలలిత - పి. సుశీల



పాట రికార్డింగ్‌లో శ్రీమతి పి. సుశీల





# నిదురించే తోటలోకి ఒకటి వచ్చింది...

- డా|| కంపల్లె రవిచంద్రన్

పాటనా తెనుగుపాట... పరవశనై... నే పరవశనై... ఎంత పరవశం ఆ పాటలో... ఎంత పరవశం ఆ గళంలో... ఎంత పరవశం ఆమె పెదాలను తాకి వచ్చే తియ్యతియ్యటి తెలుగుపదాల్లో... పాడనా తెలుగుపాట...

**పి.సుశీల...**

ఆమె తెలుగువారి అదృష్టం. ఆమె తెలుగు ఆడపిల్లలు కలలు కనే గళం.. ఆమె తెలుగువారికి ప్రతిరోజూ చెవినపడి కాసేపు స్వాంతనం కలిగించి గుండెలకు కాస్త చల్లదనం పూసే చందనం... ఆమె పాటలో ఒక జాతి సంస్కారం ఉంది. అది మనది.

* * *

ఎందరో కళాకారులకు జన్మనిచ్చిన విజయనగరమే సుశీల స్వస్థలం. అక్కడ సంగీత, సాహిత్యాలకు నిలయమైన ఒక సంప్రదాయ కుటుంబంలో పులపాక సుశీల జన్మించారు (1935). ఆమె తండ్రి పి.ముకుందరావు, తల్లి శేషావతారం. ముకుందరావు వృత్తిరీత్యా పేరున్న న్యాయవాదే అయినా ప్రవృత్తిరీత్యా కళాకారుడు. శాస్త్రీయసంగీతమంటే ఎనలేని అభిమానం. స్వయంగా వీణావిద్వాంసులు కూడా. తల్లిదండ్రులిద్దరూ సంగీతారాధకులే కావడంవల్ల తండ్రి క్రమశిక్షణ, తల్లి ప్రోత్సాహం సుశీలకు సంగీతంపట్ల అభిమానం, అభినివేశం కలగటానికి దోహదం చేశాయి.

తమ కుమార్తె శాస్త్రీయసంగీతంలో ఎం.ఎస్. సుబ్బులక్ష్మిలా పేరు తెచ్చుకోవాలని ముకుందరావు దంపతులు కలలు కనేవారు. అయితే సుశీల మాత్రం శాస్త్రీయసంగీతంకంటే కూడా లలితసంగీతం, సినీ సంగీతం అంటేనే ఇష్టపడేవారు. “పెద్దవాళ్ల బలవంతం మీద శాస్త్రీయసంగీతం నేర్చుకున్నా, నా దృష్టి మాత్రం ఎప్పుడూ సినిమాపాటల మీదే ఉండేది. హిందీలో లతామంగేష్కర్, తెలుగులో పి.భానుమతి, ఎస్.వరలక్ష్మి, పి.లీల, జిక్కీ గార్లు పాడిన పాటలను పాడుకునేదాన్ని” అంటారు సుశీల.

సుశీల ద్వారం భావనారాయణ వద్ద శాస్త్రీయసంగీతం అభ్యసించారు. విజయనగరం మహారాజా కళాశాలలో గాత్రంలో డిప్లొమో పూర్తి చేశారు. ఎన్నో కచేరీలు చేశారు. చిత్తూరు రామవిలాససభ నిర్వహించిన సంగీత ఉత్సవాల్లో ఆమె అద్భుతంగా పాడి, తంబూరాను ప్రథమ బాహుమతిగా అందుకున్నారు. హైదరాబాద్, విజయవాడ, చెన్నైలలో అనేక సంగీతకచేరీలు కూడా చేశారు. తండ్రి ప్రోత్సాహంతోనే సుశీల మద్రాసుమ్యూజిక్ అకాడెమీలో





కోర్సు చేసేందుకు వెళ్లారు. ఆ సమయంలో అకాడెమీ అధినేత ముసిరి సుబ్రహ్మణ్యం అయ్యర్ సుశీలలోని సంగీతప్రావీణ్యాన్ని గుర్తించి బాగా ప్రోత్సహించారు. అయితే ఆమెకు మాత్రం సినిమా పాటలంటేనే మోజు, ఇష్టం ఉండేవి.

సుశీల మొదట చిన్నపిల్లల కార్యక్రమాల్లో (బాలానందం) పాటలు పాడేవారు. బందాకనక లింగేశ్వరరావు, న్యాపతి రాఘవరావు (రేడియో అన్నయ్య) మాధవపెద్దిసత్యంగార్లు ఈమెను రేడియోలో బాగా ప్రోత్సహించేవారు. ఒక రోజు సుశీల రేడియోస్టేషన్‌లో ఉండే సమయంలో ప్రముఖ సంగీత దర్శకులు పెండ్యాల న్యాపతి రాఘవరావుకు టెలిఫోన్ చేసి "పాడే అమ్మాయిలుంటే ఓ పదిమందిని పంపమని" కోరారు. ఆ పదిమందిలో సుశీల కూడా ఒకరు. పెండ్యాల అప్పుడు కె.ఎస్.ప్రకాశరావు నిర్మిస్తున్న "కన్నతల్లి" చిత్రానికి సంగీతదర్శకులుగా పని చేస్తున్నారు.

అలా "కన్నతల్లి"లో మొదటి మారుగా కొందరు ముత్తయిదువులు పాడే పాటకోసం బృందగానంలో కొన్ని బిట్స్ పాడే అవకాశం పొందారామె. వాటిని విన్న పెండ్యాల... ఆమె గాత్రానికి ముగ్ధులై అదే చిత్రంకోసం... ఓ పద్యం పాడించి... అది కూడా బాగుందని ఆనందించి... ఎ.ఎం. రాజాతో కలిపి... 'ఎందుకో పిలిచావెందుకో...' అనే యుగళగీతం పాడించారు. సుశీల ఆ విధంగా వెండితెరకు పెండ్యాల ద్వారా పరిచయం అయ్యారు. ఆ పాట రికార్డింగ్‌కు వచ్చిన సౌండ్ ఇంజనీర్ నాగరాజన్... సుశీల గొంతు విని... ఏ.వి.ఎం. చెట్టియార్‌కు "ఓ అద్భుతమైన వాయిస్ వచ్చింది..." అని చెప్పారు. వెంటనే చెట్టియార్ ఆమెను పిలిపించి, పాట విని, మూడు సంవత్సరాల కాంట్రాక్టు రాయించేసుకున్నారు. ఏ.వి.ఎం.లో నిబంధనలు కాస్త కఠినంగా ఉండేవి. ఆమె ఏ.వి.ఎం.కు తప్ప బయటకంపెనీలకు పాడకూడదు. ఒకవేళ పాడినా, ఆ కంపెనీ నుంచి తీసుకునే పారితోషికంలో సగం ఏ.వి.ఎం సంస్థకు ఇచ్చేయాలి. ఈ ఒప్పందానికి కట్టుబడే ఆమె ఉద్యోగంలో చేరారు. ఆ మూడేళ్ల కాంట్రాక్టు పూర్తి కాగానే సుశీల విజృంభించారు. తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో తిరుగులేని గళనాయకి అయ్యారు. ఏ.వి.ఎం.లో ఉండేటప్పుడే 'చండీరాణి', "చంద్రహారం" వంటి చిత్రాల్లో కొన్ని కోరస్‌లు పాడారు సుశీల.

## అనురాగము విరిసేనా...

అన్నపూర్ణాసంస్థలో పాడే అవకాశం రావడం సుశీల గళ జీవితానికో పెద్ద మలుపుగా చెప్పుకోవచ్చు. అరవై సంవత్సరాల క్రితం అన్నపూర్ణ సంస్థ ప్రారంభించబడి, కె.వి.రెడ్డి దర్శకత్వంలో "దొంగరాముడు" చిత్రనిర్మాణానికి సన్నాహాలు జరుపుకుంటున్న తరుణమది. కథానాయిక సావిత్రికి నేపథ్యగాయనిగా అప్పటికే మంచిపేరులో ఉన్న జిక్కిని ఎంపికచేసి, పెండ్యాల స్వరసారథ్యంలో పాటలు రికార్డ్ చేసేశారు. కథానాయకుని చెల్లెలు పాత్రధారిణి జమునకు గాయనికోసం దుక్కిపాటి మధుసూదనరావు వెతుకుతున్నారు. ఆయన, కె.వి.రెడ్డి





ఒకరోజు ఏ.వి.ఎం. స్టూడియోకు వెళ్లినప్పుడు రికార్డింగ్ థియేటర్ దగ్గర నిలబడివుంటే ఒక కొత్తగొంతుక వినిపించి వారిని ఎంతగానో ఆకర్షించింది. ఆ గాత్రం సుశీలదని తెలిసింది. అప్పుడే జమునపాత్రకు సుశీలను నేపథ్యగాయనిగా నిర్ణయించారు. సౌండ్ఇంజనీర్ కృష్ణయ్యర్ దగ్గర సుశీల అడ్రస్ తీసుకుని, ఆమెను పిలిపించి పాట పాడించుకుని విని సంతృప్తి చెందారు. అలా సుశీలచేత 'దొంగరాముడు'లో మూడు పాటలు పాడించారు. "దొంగరాముడు" అఖిలాంధ్ర ప్రేక్షకుల హృదయాన్ని దోచుకున్నాడు. దీంతో గాయనిగా సుశీలకు బంగారుభవిష్యత్తు వచ్చినట్టయ్యింది. తెరపై జమున చూపించిన సిగ్ధత్వాన్ని, తన కంఠంలో అంతే సున్నితంగా ఒలికించారు సుశీల.

## బృందావనమది అందరిది...

'విజయా' సంస్థలోకి సుశీల అడుగుపెట్టడం కూడా యాదృచ్ఛికంగానే జరిగింది. అదెలాగంటే– 'అనురాగము విరిసేనా' పాట రికార్డింగ్ సమయంలో వాహినిలో ఒక తమాషా సంఘటన జరిగింది. సుశీల పాట పాడి వెళ్లిపోయిన తర్వాత దుక్కిపాటి, కె.వి.రెడ్డి ఆ పాటలను వింటున్నారు. ఆ సమయంలో పక్కన "మిస్సమ్మ" షూటింగ్ జరుగుతోంది. షూటింగ్ అయిపోగానే ఎల్.వి.ప్రసాద్, చక్రపాణిలు ఇంటికి వెళ్లిపోతూ ఆ పాట విని అంతకు నాలుగురోజుల క్రితం అక్కడ లతామంగేష్కర్ పాడి వెళ్లిన ఒక పాటను ట్రాన్స్‌పోజ్ చేస్తున్నారేమోననుకుని లోపలికి వచ్చారు. కానీ అక్కడ దుక్కిపాటి, కె.వి.రెడ్డిలను చూసి ఆశ్చర్యపోయి "ఏమిటి మీరిక్కడున్నారు?" అని అడిగితే, "ఇది మా సినిమాలో పాటే. పి.సుశీల అని కొత్త అమ్మాయి పాడింది" అని చెప్పగానే మరింత ఆశ్చర్యపోయారు.

ఆ తర్వాత చక్రపాణి "మిస్సమ్మ" (1955) లో 'బృందావనమది అందరిది' అనే పాటను ఏ.ఎం.రాజాతో కలిపి సుశీలచేత పాడించారు. "మిస్సమ్మ"లో కూడా జమునకే ప్లేబాక్ పాడారు పి.సుశీల. 'విజయా'లో ప్రవేశించాక సుశీలకు విజయాలే గానీ పరాజయాలు లేవు.

"మాయాబజార్"లో పి.సుశీల పాడిన 'అహ నా పెళ్లంట' పాట ఆమె గళవైవిధ్యానికో కొలికిపూస. "మాయాబజార్"లో హాస్యరసం ప్రధానపాత్రధారులతోనేకాక ఉపపాత్రధారులతోనూ పండినట్లు, మరే చిత్రంలోనూ, ఆద్యంతం హాస్య చిత్రాలనుకొనే వాటిలోనూ పండలేదు. అంతటి చిత్రంలోనే తలమానికం మాయాశశిరేఖ పెళ్లినాటి ఉదయం తన పరిచారికలను గగ్గోలు పెట్టిస్తూ, పాదపీఠాలను పగలగొట్టేస్తూ హాహాకారాలను చిందించేస్తూ పాడిన 'అహ నా పెళ్లి యంట' పాట. సుశీల ఏ జంకూగొంకూ లేకుండా పాడిన హాస్యగీతాలలో ఇదే ప్రథమశ్రేణికి చెందిందంటే ఆశ్చర్యం లేదు. మధ్యలో ఘంటసాల ఎస్.వి.రంగారావుకు గొంతు కలపడం, వెంటనే సరిచేసుకుని సుశీలవడం ఈ పాటకు పింగళి, కె.వి.రెడ్డి, ఘంటసాల పెట్టిన అలంకారాలు. ఈ 'అహనా పెళ్లంట' పాటే సుశీలకు శాశ్వతమైనకీర్తిని సంపాదించే అనేక గీతాలను పాడటానికి అవకాశద్వారాలను తెరిచింది.



శ్రీ ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతి పి. సుశీలతో శ్రీ మండలి బుద్ధప్రసాద్




38

గిన్నిస్‌బుక్‌లో స్థానం పొందిన సందర్భంగా 'సంగమం' సంస్థ ఆధ్వర్యంలో శ్రీమతి పి. సుశీలను సత్కరిస్తున్న శ్రీ బుద్ధప్రసాద్, శ్రీమతి పద్మా దేవేందర్ రెడ్డి, డా॥ సి. నారాయణరెడ్డి, శ్రీమతి ఎస్. జానకి, శ్రీ కె.వి. రమణాచారి, శ్రీమతి నన్నపనేని రాజకుమారి, శ్రీమతి లక్ష్మీపార్వతి, శ్రీమతి జమునారాణి, శ్రీమతి రోజారమణి తదితరులు

## మహానటి సావిత్రికి పి.సుశీల పాట

"దొంగరాముడు"లో ద్వితీయ కథానాయికకు పాడుతున్న సమయంలోనే సుశీల గాత్రం పీలగా ఉంటుందనీ, నూతిలోనుండి పాడినట్లు వినిపిస్తుందనీ పరిశ్రమలో అందరూ నిరుత్సాహపరిచినా అన్నపూర్ణా సంస్థ అధైర్యపడలేదు. తీరా "దొంగరాముడు" విడుదలై ఘనవిజయం సాధించిన తర్వాత అలా నిరుత్సాహపరచిన పెద్దలే వారివారి చిత్రాల్లో సుశీలే పాడాలని ఎగబడ్డారు. అన్నపూర్ణసంస్థ చరిత్రకూ సుశీల సినీజీవితానికీ వయసు ఒకటే. సుశీల మొట్టమొదటిసారిగా కథానాయిక పాత్రకు పాడింది కూడా 'అన్నపూర్ణా' వారి "తోడికోడళ్లు" (1957) లోనే తెలుగు, తమిళభాషల్లో నిర్మించిన ఆ చిత్రానికి నాయిక (సావిత్రి) పాటలన్నీ రెండు భాషల్లోనూ సుశీలే పాడారు. రెండుభాషల్లోనూ ఆ చిత్రం ఘనవిజయం సాధించింది. సుశీల ప్రాచుర్యం కూడా ఎంతగానో ఇనుమడించింది.

తాను తొలిసారిగా కథానాయికకు పాడిన పాటలు సావిత్రికే కావడంవల్లనేమో సావిత్రి అంటే సుశీలకు చెప్పలేనంత అభిమానం. సావిత్రికి కూడా సుశీల అంటే పంచప్రాణాలు. తను కథానాయికగా నటించాలంటే తనకు సుశీల వాయిసే కావాలని సావిత్రి నిర్మాతలను ఒప్పించిన సందర్భాలెన్నో ఉన్నాయి.

"తోడికోడళ్లు" తర్వాత ఏ.వి.ఎం. నుంచి బయటికొచ్చేసి జైత్రయాత్ర ప్రారంభించారు సుశీల. పెండ్యాల, కె.వి.మహాదేవన్, ఆదినారాయణరావు, అశ్వత్థామ, సాలూరి రాజేశ్వరరావు, మాస్టర్ వేణు, విశ్వనాథన్- రామ్మూర్తి, సుసర్ల దక్షిణామూర్తి, ఘంటసాల, జి.కె.వెంకటేష్, టి.చలపతిరావు, రమేష్ నాయుడు, చక్రవర్తి, సత్యం వంటి సంగీతదర్శకులందరి దగ్గర కొన్నివేల పాటలు పాడారామె. ఎన్నని చెప్పుకోవాలి? ఏవని చెప్పుకోవాలి? ఒకప్పుడు పి.సుశీల పాటలేని తెలుగుచిత్రం ఉండేదికాదు. ఆమె పేరు తెలీని ఆంధ్రుడూ ఉండడు. ఏడు దశాబ్దాలుగా సుశీల తెలుగులోనే గాక వివిధ భాషల్లో పాడిన పాటలు ఎన్నని లెక్కగడితే ఆమె రికార్డ్‌ను అధిగమించిన గాయని మనదేశంలో ఒక్క లతామంగేష్కర్ మాత్రమే. అందుకేనేమో సుశీలను అందరూ 'దక్షిణభారతదేశపు లతామంగేష్కర్'గా అభివర్ణిస్తుంటారు.

## ఏమని పాడెదనో... ఎన్నని పాడెదనో...

సుశీల గాత్రమాధుర్యాన్ని కొలవడానికి ఏ పాటను తూకపురాయిగా తీసుకోవాలో నిర్ణయించడం అసాధ్యం. ఏ పాట కాపాటే సాటి కాబట్టి. 'పాలకడలిపై శేషతల్పమున' (చెంచులక్ష్మి), 'నీవుండేదా కొండపై' (భాగ్యరేఖ), 'సఖియా వివరించవే' (నర్తనశాల), 'పాడమని నన్నడగవలెనా' (డా॥ చక్రవర్తి), 'సన్నగవీచే చల్లగాలికి' (గుండమ్మకథ), 'ఇది మల్లెల వేళయని' (సుఖదుఃఖాలు) 'గోదారి గట్టుంది' (మూగమనసులు), 'నడిరేయి గడిచేనే' (జయసింహ) 'నేను నేనే సుమా' (మోహినీ భస్మాసుర), 'పిలువకురా' (సువర్ణసుందరి), 'ఏమని





పాడెదనో' (భార్యభర్తలు), 'అందాల పసిపాప' (చిట్టిచెల్లెలు)... ఇలా ఎన్ని, ఎన్నన్ని, ఈ జాబితాకు అంతంటూ ఉంటుందా! ఎన్ని చెప్పుకున్నా ఒక్కటి మాత్రం నిజం- సుశీల కంఠంలాంటి మాధుర్యం కల్గిన కంఠం మరొకటి లేదు. రాదు. ఎన్ని తరాలు మారినా, అంతరాలు పెరిగినా మాధుర్యానికి శాశ్వతచిరునామా సుశీల కంఠమే.

ప్రతిభ ఉండాలే కానీ కంఠంలో ఎంత వైవిధ్యం చూపించవచ్చో, ఎలా విలక్షణత సాధించవచ్చో నిరూపించారు సుశీల. జానపదగీతాలు (పాండవులు పాండవులు తుమ్మెదా), టీజింగ్ సాంగ్స్ (ఎప్పుడూ మీ పాతాలంటే ఎలాగండీ సార్). భక్తిగీతాలు (జననీశివకామిని), లాలిపాటలు (వటపత్ర శాయికి వరహాల లాలి) శోకగీతాలు (మనసా... కవ్వించకే నన్నిలా), యిలా నవరసాలు సుశీల కంఠంలో పలికి తేనెచినుకులు కురిసాయి. తెలుగులో శాస్త్రీయ జావళీలు వంద, వీణపాటలు ఎనభై, తల్లులు పిల్లలకు పాడే జోలపాటలు నూట ఇరవై భక్తిపాటలు ఏడువందలు, విషాద గీతాలు మూడువందలు పాడారు సుశీల. ఈ రికార్డు మరే యితర భాషలో కూడా ఏ యితర గాయనీమణికీ లేదు. తెలుగులో సుమారు తొమ్మిదివేల పాటలు పాడారు సుశీల.

యుగళగీతాల విషయానికి వస్తే... ఆ విశ్లేషణకే ఒక ప్రత్యేకసంచిక తేవాల్సి ఉంటుందేమో! ఘంటసాల, టి.ఎం. సౌందరరాజన్, ఏ.ఎం.రాజా, పి.బి.శ్రీనివాస్, బాలమురళీకృష్ణ, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, జేసుదాసు, రామకృష్ణ, పిఠాపురం, మాధవపెద్దిసత్యం, జి.ఆనంద్ వంటి గాయకులతో పాడిన వేల యుగళగీతాలు గుర్తుకు వస్తాయి. ఘంటసాలతో కలిసి పి.సుశీల ఆలపించిన యుగళ గీతాలు నేటికీ నిత్యనూతనాలై అలరారుతున్నాయి. ఆడియో డి.వి.డి.ల అమ్మకంలో వీరిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన పాటల డి.వి.డి.లే నేటికీ బాగా అమ్ముడుపోతున్నాయి.

ఘంటసాల మరణించిన సమయంలో మాలతీచందూర్ "ఘంటసాల మరణంతో గానకోకిల సుశీల గళం కూడా మూగబోయింది" అని రాశారు - అంటే సుశీలకు ధీటుగా పాడగలిగే గాయకులు కరవయ్యారని మాలతీ చందూర్ అభిప్రాయం.

ఒక ప్రక్క సినిమాలో గొప్ప గాయనిగా అలరారుతూనే సుశీల మరోపక్క సంగీత కచేరీలు కూడా చేశారు. అయితే ఈ సవ్యసాచిత్వం ఎక్కువకాలం కొనసాగించలేకపోయారామె. సినిమాపాటల రికార్డింగ్‌లతో క్షణకాలం తీరికుండేది కాదు. దాంతో క్రమంగా శాస్త్రీయ సంగీతానికి దూరమయ్యారు. అయితేనేం తన శాస్త్రీయవిద్వత్తునంతా సినిమా పాటల్లో గుప్పించారామె. సుశీల సినిమాల్లో పాడిన శాస్త్రీయగీతాలు వేటికవే రసజ్ఞసంచికలు.

## సుశీలకు నచ్చిన పాట

ఎందరో సంగీతఅభిమానులను మీకు నచ్చినపాట ఏది అంటే సుశీల పాటే చెప్తుంటారు.





అలా ఎందరో అభిమానిస్తున్న సుశీలకూ అభిమాన గీతాలున్నాయి. ఆ విషయమే ఆమె దగ్గర ప్రస్తావిస్తే... "ఎన్నో పాటలు నాకిష్టమైనవి ఉన్నాయి. నా మనసుకు బాగా నచ్చిన గీతాల్లో 'న తుమ్ బేవఫా హై... న హమ్ బేవఫా హై... మగర్ క్యాకరే అప్‌ని రాహే జుదాహై' (నువ్వు విశ్వాసహీనుడివి కావు, నేనూ విశ్వాసహీనురాలిని కాను... కానీ ఏం చేయగలం? మన మార్గాలే వేరయినప్పుడు) అంటూ సాగే గీతం అంటే నాకెంతో ఇష్టం. ఆ పాట వినగానే అవ్యక్త ఆనందానుభూతి కలుగుతుందని" చెబుతారు సుశీల.

ఇక తన పాటల్లో తన కిష్టమైన పాటగా "చక్రవాకం" చిత్రంలోని "వీణలో నా... తీగలోనా... ఎక్కడున్నదీ రాగం" ను చెబుతారు ఆమె. సంగీతంలో క్లిష్టమైనరాగాల్లో చక్రవాక రాగం ఒకటి. కె.వి. మహాదేవన్ ఆ పాటను ఆ రాగంలో సమకూర్చారు.

## మనసు పరిమళించెనే...

ప్రతివ్యక్తి జీవితంలోనూ మరచిపోలేని మధురసంఘటనలు ఎన్నో వుంటాయి. అలాగే గాయని సుశీల జీవితంలోనూ ఉన్నాయి. "చిన్నతనం నుంచి తాను విపరీతంగా అభిమానించే గాయని భారతరత్న లతామంగేష్కర్ ఒక రోజు స్వయంగా తన ఇంటికి వచ్చి ఆతిథ్యం స్వీకరించిన సంఘటనను ఎన్నటికీ మరచిపోలేనని" సుశీల అంటారు.

చేదు అనుభవాల విషయానికి వస్తే - "మావారి మరణమే నాకు పెద్ద చేదుఅనుభవం" అంటారామె.

"రాజారమేష్" చిత్రంలో రామకృష్ణ, ఎస్.జానకి పాడిన "నెల్లూరు నెరజాణ పాటను వారితో పాడించినట్లు తెలీనికారణంగా నేనూ పాడాను. ఈ విషయం జ్ఞాపకమొచ్చినప్పుడల్లా బాధపడుతుంటాను" అని ఆవేదనగా చెప్పారు.

తనలోని మహాగాయనిని సైతం మరపించి, మంచిమనసును మన కనులముందు సాక్షాత్కరింపజేసే వ్యక్తిత్వం సుశీలది.

## మధురం... మధురం... ఈ సమయం

పి.సుశీలకు అవార్డులు తీసుకోవడం కొత్త కాదు. తన సుదీర్ఘచిత్రజీవితంలో ఐదు పర్యాయాలు జాతీయ అవార్డులు (ఉత్తమగాయని) అందుకున్నారు. 1969లో "ఉయిరన్ద మనిదన్" (తమిళం) అనే చిత్రంలో ఆమె పాడిన పాటకు మొదటిసారి జాతీయబహుమతి వచ్చింది. ఆ తరువాత "సవాలే సమాలి" (తమిళం; 1971), "సిరిసిరిమువ్వ" (తెలుగు; 1977), "మేఘసందేశం" (తెలుగు; 1982), "ఎమ్మెల్యే ఏడుకొండలు" (తెలుగు 1983) చిత్రాలలో పాటలకుగాను జాతీయఉత్తమ గాయని అవార్డులు అందుకున్నారు. 1978-79 సంవత్సరానికి తమిళనాడు ప్రభుత్వం ఆమెను 'కలైమామణి' అవార్డుతో సత్కరించింది.

ఆంధ్రవిశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ (కళాప్రపూర్ణ) తో సత్కరించింది. అలాగే 1977, 1978, 1982, 1984, 1989 లలో ఆమెకు మన రాష్ట్రప్రభుత్వం ఉత్తమగాయనిగా సత్కరించింది. కేరళ ప్రభుత్వం ఇచ్చిన పురస్కారాలు కూడా ఎన్నో ఉన్నాయి. ప్రాంతీయంగా ఆమె పొందిన అవార్డులకూ, బిరుదులకూ లెక్కే లేదు. ఆమె సంగీతరజతోత్సవం సందర్భంగా హైదరాబాదులోని నిజాం కాలేజిగ్రౌండ్స్‌లో పెద్ద సభ జరిపి సుశీలను ఘనంగా సన్మానించారు. 'సంగీతసరస్వతి' బిరుదును ప్రదానం చేశారు. ఆ మధ్య ఒక ప్రైవేటు టి.వి ఛానెల్ వారు సుశీల జీవిత స్వర్ణోత్సవవేడుకలను కూడా నిర్వహించారు.

కొన్ని అవార్డులు ఉంటాయి. వాటిని కనుక సాధించగలిగితే, ఆ సాధించినవ్యక్తికి కీర్తిప్రతిష్ఠలు వస్తాయి. కొందరు ఉంటారు. వాళ్లకి ఏదన్నా అవార్డు ఇస్తే, ఆ అవార్డుకే ప్రతిష్ఠ పెరిగిపోయినట్లు అనిపిస్తుంది. 2002 సంవత్సరానికి గాను, తెలుగు సినిమారంగానికి సంబంధించి అత్యుత్తమపురస్కారమైన 'రఘుపతి వెంకయ్య అవార్డు' సుశీలకు ఇవ్వడంవల్ల ఆమె కీర్తి పెరగడమే కాదు, ఆ అవార్డు ప్రతిష్ఠ కూడా ఇనుమడించిందనే చెప్పవచ్చు.

**ఈనాటి ఈ బంధమేనాటిదో!**

పి.సుశీలది ప్రేమ వివాహం. విజయనగరం వారే అయిన గోదావరిరాజు గారి రెండవ కుమారుడైన డా॥ రాజా రామమోహనరావును ప్రేమించి పెళ్లి చేసుకున్నారు. మోహనరావు మద్రాసులో జి.సి.ఐ.ఎమ్ చదువుతున్న సమయంలో పరిచయమయ్యారు. పరిచయమే ప్రణయంగా పల్లవించడంతో, కుటుంబసభ్యుల అనుమతితో ఆయననే వివాహం చేసుకున్నారు సుశీల.

సుశీల అంటే మోహనరావుకు చెప్పలేని అభిమానం. పైపెచ్చు కళాభిమాని కూడా. ఎంతటి విలువైన బంగారు పళ్లానికైనా గోడ చేరువ కావాలన్నట్లు ఎంతటి కళాకారులకైనా ప్రోత్సాహం తప్పనిసరి. మోహనరావు సుశీలను కంటికిరెప్పలా చూసుకునేవారు. "ఆయన ప్రోత్సాహంవల్లే నేను యిన్నేళ్లు పరిశ్రమలో నిలబడగలిగాను" అంటారు సుశీల. సుశీల భర్త 1990లో మరణించారు. హైబ్లడ్ ప్రెషర్, హార్ట్‌ట్రబుల్‌తో బాధపడుతున్న భర్తను అమెరికాలో ఓపెన్‌హార్ట్ సర్జరీ చేయించడం కోసం, తన కుమారుణ్ణి (జయకృష్ణ) వెంటబెట్టుకుని వెళ్లారామె. గుండె ఆపరేషన్లలో ప్రపంచ ప్రసిద్ధిచెందిన డాక్టర్ జాన్సన్ మోహనరావుకు ఆపరేషన్ చేశారు. విజయం సాధించారు. కానీ ఆపరేషన్ జరిగిన ఆరవనాడే మోహనరావు కన్నుమూశారు. సంగీతంపై మక్కువతో 1957లో తనను పరిణయమాడి, రికార్డింగ్‌సమయాల్లో సైతం పాడటంలో తగిన సూచనలిచ్చిన తన జీవిత భాగస్వామి శాశ్వతనిష్క్రమణను ఆమె భరించలేకపోయారు.

మిల్వాకీ నగరంలోని విద్యుత్ స్మశానవాటికలోనే ఆయన అంత్యక్రియలు జరిగాయి.

సుశీల పతి చితాభస్మంతో మద్రాసుకు తిరిగి వచ్చారు. భర్తృవియోగం తర్వాత కొంతకాలం పలుకైనా పలుకలేదు ఈ గానకోకిల. తర్వాత నెమ్మదిగా కోలుకున్నారు. ప్రస్తుతం తన కుమారుడు, కోడలు, (మేనకోడలినే కోడలిని చేసుకున్నారు) మనవరాలితో కలసి జీవిస్తున్నారు.

రాజసులోచన, అంజలీదేవి, దేవిక షావుకారు జానకి, కృష్ణకుమారి వంటి ఆ తరంవారి దగ్గరనుంచి మధ్యతరం శ్రీదేవి, జయప్రద, విజయశాంతి, ఆ తర్వాతి తరం రోజా, మీనా వరకు హీరోయిన్లందరికీ సుశీల పాడారు.

**అందుకే...**

పి.సుశీల ఏడు దశాబ్దాల నుంచీ అంతే మధురంగా పాడుతూ వస్తున్నారు. నేటికీ పాడుతున్నారు. ఇక ముందు కూడా పాడుతారు. ఈ దుష్టవ్యాపారప్రపంచంలో మనమనుభవిస్తున్న వెతలు, వేదనలు, అలసటల నుంచి మనల్ని సేదదీర్చి మన హృదయాలమీద ఇంత పన్నీటిజల్లుల్ని చిలకరించడం కోసం మన మానసాకాశంలో ఈ కోకిల అలా ఎగురుతూ గానం చేస్తూనే ఉంటుంది. ఒక్క మనమే కాదు, మన తర్వాత తరాల వాళ్లూ, ఆ తరువాత తరాలవాళ్లూ, ఇంకా ఆ తర్వాత వాళ్లూ... ఇలా అనేకానేక తరాల దాకా ఆమె అందించిన ఈ మధుర రసానందాల్ని అలా ఆస్వాదిస్తూనే ఉంటారు.

**అందుకే ఆమె పి. సుశీల.**

**నైటింగేల్ ఆఫ్ ది సౌత్.**

*(22.02.2004 నాటి ఆంధ్రజ్యోతి ఆదివారం సంచిక నుండి)*



**చిన్నారి సుశీల**







శ్రీమతి పి. సుశీల, డా॥ సి. నారాయణరెడ్డి, శ్రీమతి రావుబాలసరస్వతీదేవి, శ్రీ మండలి బుద్ధప్రసాద్




హైదరాబాద్‌లో 'సంగమం' సంస్థ ఆధ్వర్యంలో జరిగిన ఎస్వీ రంగారావు శతజయంతి వేడుకలో శ్రీమతి సుశీలను సత్కరిస్తున్న భారత ఉపరాష్ట్రపతి శ్రీ ఎం. వెంకయ్యనాయుడు

# సమ్మోహన స్వరం - సుశీలకు వరం

- ఎస్.వి. రామారావు

సుమారు ఆరు పుష్కరాలకు పూర్వం 1935 నవంబరు 13న కళలకు చక్కగా సంగీతానికి పుట్టినిల్లయిన విజయనగరంలో జన్మించిన సుశీల తన తండ్రితో కలిసి యెన్నో సినిమాలు చూసి సంగీతం పట్ల అభిమానం పెంచుకొని ద్వారం వెంకటస్వామినాయుడు వద్ద కొంతకాలం సంగీతసాధన చేశారు.

మకాం మద్రాసుకు మారిన తరువాత 1951లో కె.ఎన్.ప్రకాశరావు ప్రారంభించిన 'కన్నతల్లి' చిత్రంలో ఒక కోరస్ పాటకోసం రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవరావు పంపగా పెండ్యాల నాగేశ్వరరావు సుశీల గాత్రానికి ముగ్ధులై ఆమెచేత కోరస్‌తోబాటు ఒక పద్యం, ఏ.యం.రాజాతో కలిసి 'ఎందుకో నిలిచావెందుకో' యుగళగీతం పాడే అవకాశం కల్పించి ఆమె సినీ రంగ ప్రవేశానికి నాంది పలికారు.

ఆ వెంటనే ఆమె కంఠమాధుర్యాన్ని గూర్చి విన్న ఏ.వి.యం. చెట్టియార్ మూడు సంవత్సరాలు వారి సినిమాల్లో పాడేందుకు కాంట్రాక్టు తీసుకున్నారు. ఆ కాలంలో ఆమె 'సంఘం' చిత్రానికి రాజేశ్వరితో కలిసి 'సుందరాంగ మరువగలేనోయి రావేల' అన్న గీతాన్ని అద్భుతంగా ఆలపించారు. (అంజలి, వైజయంతీమాల పై చిత్రీకరణ)

ఆ తరువాత ఆమె జీవితాన్ని మలుపు తిప్పిన సంవత్సరం 1955. ఆ సంవత్సరం 'మిస్సమ్మ'లోని 'బాలనురా మదనా', 'దొంగరాముడు'లోని 'అనురాగము విరిసేనా' పాటలు (జమనపై చిత్రీకరణ) ఆమెకు ఎంతో పేరు తెచ్చిపెట్టాయి. ఇహ అపైన ఆమెకు హీరోయిన్ పాత్రలకు ప్లేబాక్ పాడే అవకాశాలు వెతుక్కుంటూ వచ్చాయి.

వాటిని సద్వినియోగం చేసుకొని నాలుగు దశాబ్దాల పాటు నాలుగు దక్షిణాది భాషల్లో తెలుగు, తమిళ, కన్నడ, మలయాళంలో సుమారు నలభై వేల పాటలు పాడారు. బహుశా యావద్భారతదేశంలో లతామంగేష్కర్ తరువాత అధిక సంఖ్యలో పాటలు పాడిన గౌరవం సుశీలదేనేమో!

'అనురాగము వీరిసేనా ఓరేరాజా' (జమున-దొంగరాముడు), 'మీ నగుమోము నా కనులారా' (అంజలీదేవి-బడిపంతులు), 'తెలియని ఆనందం' (సావిత్రి-మాంగల్యబలం) 'ఏమని పాడెదనో యీ వేళ (కృష్ణకుమారి - భార్యాభర్తలు), 'పాడెద నీ నామమే గోపాలా' (శారద - అమాయకురాలు), 'ఇది మల్లెల వేళయనీ' (వాణిశ్రీ - సుఖదుఃఖాలు), 'జోరుమీదున్నావు తుమ్మెదా (జయసుధ - శివరంజని), 'ముందు తెలిసెనా ప్రభూ' (జయప్రద





– మేఘ సందేశం) 'భారతమాతను నేను బందీనై పడివున్నాను' (విజయశాంతి – నేటిభారతం).

పైన పేర్కొన్నవి నాలుగు తరాలకు చెందిన కథానాయికలపై నాలుగు దశాబ్దాల (1953-1993)లో చిత్రీకరించబడిన పాటల పల్లవులు అయితే ఆ పాటలన్నీ ఆ నటీమణులే పాడారేమో అన్నంత భావస్ఫోరకంగా పాడి తన గానవిద్యచే దక్షిణ భారత సినీ సంగీత ప్రియుల్ని సమ్మోహనపరచిన గంధర్వ గాయని పి.సుశీల,

హాస్యగీతాలు (మాయాబజార్ – అహనా పెళ్లంట), ఊహగీతాలు (వినిపించని రాగాలే – చదువుకున్న అమ్మాయిలు),

లలిత గీతాలు (సఖియా వివరించవే – నర్తనశాల), భక్తిగీతాలు (జననీ శివకామినీ – నర్తనశాల), విరహగీతాలు (సన్నగ వీచే చల్లగాలిలో – గుండమ్మకథ), ఆహ్లాద గీతాలు (వెన్నెలలోనే వికాసమే – ఆరాధన), ఆర్ద్రగీతాలు (ఎవరో రావాలి-ప్రేమనగర్), సందర్భోచిత తెలుగు గీతం (పాడనా తెలుగు పాట – అమెరికా అమ్మాయి) యీ విధంగా నవరసాల్ని, నవరాగాల్ని, సప్తస్వరాల్ని తన గళంలో అలవోకగా పలికించటం సుశీలకే చెల్లింది.

ప్రఖ్యాత గాయని పి.లీలతో కలిసి లకువశ పాటలు, జానకితో కలిసి 'సరిలేరు నీకెవ్వరూ' (కంచుకోట), ఎల్. ఆర్. ఈశ్వరితో కలిసి 'నాగులేటి వాగులో కడప ముంచుకొస్తుంటే' (మూగప్రేమ) రసవత్తరంగా పాడిన వైనం తలుచుకొంటే ఆ గాయనీమణుల పరస్పర అవగాహన, అనురాగం విశదమౌతాయి.

1958లో వచ్చిన 'చెంచులక్ష్మి' చిత్రంలో పాడిన భాగవత పద్యం 'మందార మకరంద మాధుర్యమున తేలు' ఎంత భావయుక్తంగా పాడిందో, అంతకుమించిన మాధుర్యంతో అదే పద్యాన్ని అదే రాజేశ్వరరావు స్వరరచనలో 1967 లో వచ్చిన 'భక్త ప్రహ్లాద'లో ఆలపించటం ఆమెకే దక్కిన అరుదైన అవకాశం, అదృష్టం. బాల పాత్రలకు తగ్గట్టుగా స్వరచాలనం చేయటం సుశీల ప్రత్యేకత. ఇందుకు బాలనటిగా శ్రీదేవిపై చిత్రీకరించిన 'చక్కనయ్యా చందమామ' (భార్యాబిడ్డలు), 'బూచోడమ్మా బూచోడు' (బడిపంతులు) పాటలు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. అదే శ్రీదేవి కథానాయకగా రూపాంతరం చెందాక కూడా ఆమెకు పాడి మెప్పించడం సుశీలకు లభించిన అపూర్వ అవకాశం. ఆమె పాల్గొన్న సంగీత కార్యక్రమాల్లో కొన్నిటికి సముచిత వ్యాఖ్యానం అందించటం యీ వ్యాసకర్తకు దక్కిన అదృష్టం. పి. సుశీలకు ఎన్నెన్నో పురస్కారాలు లభించాయి. ప్రభుత్వ పరంగా 'కలైమామణి', 'పద్మభూషణ్', అభిమానుల నుంచి, సాంస్కృతిక సంస్థల నుంచి 'మధుర గాయిని', 'గంధర్వగాయిని', గానకోకిల' వంటి బిరుదులు. ఒక గాయనిగా జీవితాన్ని సఫలం చేసుకున్న సుశీలగారికి 'జీవన సాఫల్య పురస్కారం అందించడం సముచిత సత్కారమే!





# తెలుగు భాషకు జాతీయ ఖ్యాతి తెచ్చిన మహాగాయని సుశీల

**– డా. జి వి పూర్ణచందు**

"తెలుగుకు జాతీయభాష కాగల అర్హతలున్నాయని ఒకప్పుడు జి.బి.యన్. హాల్డేన్ పండితుడన్నాడు. ఆయన ఆంధ్ర దురభిమాని కాదు. నిష్పక్షపాతి. ఆయన వైజ్ఞానికుడు. శ్రీమతి సుశీల పాటలు దేశమంతా వ్యాపించి, తెలుగు భాషకు సముచిత స్థానం సంపాదించగలుగుతాయనుకోవటం దురాశ కాదేమో! దేశాన్ని సశ్యశ్యామలం చేసేది తెలుగు భాష. ఈ గుర్తింపుకు గాయనీమణి సుశీల కంఠస్వరం దోహదం చేయగలదు" అని గానకోకిల పి. సుశీలగారి సినీ సంగీత జీవిత రజతోత్సవం సందర్భంగా మహాకవి శ్రీశ్రీ అన్నారు. ఆమె ఇతర భాషల పాటలతోనే అనికాదు, ఒక్క తెలుగు పాటలతోనే దేశఖ్యాతి సంపాదించుకోవాలని, తద్వారా తెలుగు భాషకు ఖ్యాతినార్జించాలని ఆయన ఆశించారు.

"దేవులపల్లివారి పాట, సుశీల గారి గాత్రం మార్దవానికి, మాధుర్యానికి మరోపేర్లని సహజకవి మల్లెమాలగారు వ్యాఖ్యానించారు. ఆమె గొంతులో పలకని భావం లేదు, ఒలకని రసం లేదు, పాతికేళ్లుగా కమ్మదనం మీద సుశీలకున్న అధికారం తిరుగులేనిదన్నారాయన.

ఇది నలభై యేళ్ల క్రితంనాటి మాట. మల్లెమాలవారు సజీవులై ఉండి, ఇప్పుడు సందేశం ఇస్తే ఇవే మాటలు అంటారు. ఎందుకంటే ఈనాటికీ తనపాటల్తో "ఆమని వేళ"ల్ని తెచ్చి ఇస్తున్న మహాగాయని ఆమె కాబట్టి!

"ఉత్తర క్షోణిలో ఆ సంగీత 'లత', దక్షిణావనిలో ఈ గాన 'శీల', ఇదీ తూకం...అని ఎంతో లోతైన భావాన్ని నాలుగు మాటల్లో కూర్చి చెప్పారు ఆ సందర్భంలోనే సినారే!

"దీపానికి కిరణం ఆభరణం, రూపానికి హృదయం ఆభరణం...అని నారాయణరెడ్డిగారు రాసిన పాట నాకిష్టం. 'పాటకి పుట్టుకే గానీ చావుండదనుకుంటాను. పాడినవారు, వ్రాసినవారు, విని ఆనందించినవారు మిగిలి లేకపోయినా పాట ఎప్పటికీ నిలిచేవుంటుంది. పాటకు తరతమ బేధాల్లేవు. వ్యత్యాసాల్లేవు. విభజనల్లేవు, పాట మహౌన్నతమైంది.." అనేది చాలా సందర్భాల్లో ఆమెను ఉటంకిస్తూ ఎందరో ఉదహరించే సుశీల గారి సూక్తి. ఈ చల్లని లోగిలిలో/ ఈ బంగరు కోవెలలో ఆనందం నిండాలి/అనురాగం పండాలి" అనే పాట ఆమె గాత్రాన వినటం గొప్ప అనుభూతి.

కోకిలమ్మ పెళ్లికి కోనంతా పందిరి
చిగురాకులు తోరణాలు.. చిరుగాలి సన్నాయి





వసంతుడే పెళ్లికొడుకు.. వనమంతా సందడి
పూలన్నీ తలంబ్రాలు.. పున్నమి తొలిరేయి

... మనోహరమైన ఈ పాట వింటూంటే మనం మధురమైన మరోలోకంలో తేలిపోతుంటాం. తరాలు గడిచినా ఈ పాటలోని స్వర మాధుర్యం నిత్యనూతనం.

పాడనా తెలుగు పాట...పరవశనై...నే పరవశనై" అటు తెలు భాష మాధుర్యానికి తాను పరవశమై, అందరినీ పరవశింపచేసిన మహాగాయని ఆమె. దాశరథిగారన్నట్టు ఆమె స్వరాధిదేవత. తెలుగు జాతి సంస్కారానికి ఆమె ఒక మచ్చుతునక.

★ ★ ★

2018 ఆగష్టు 4న శ్రీ మండలి వెంకట కృష్ణారావు ఫౌండేషన్ ద్వారా తొలిగా అందిస్తున్న "శ్రీ మండలి వెంకట కృష్ణారావు తెలుగు వైభవ పురస్కారం" స్వీకరించ వలసిందిగా కోరటానికి డా. మండలి బుద్ధప్రసాద్ గారితో కలిసి చెన్నైలో సుశీలగారి ఇంటికి వెళ్లే అదృష్టం నాకు దక్కింది. సుశీలగారితో కూర్చుని ఎన్నో విషయాలు ముచ్చటించే గొప్ప అవకాశం అది. చెన్నై శ్రీకళాసుధ శ్రీనివాస్ గారు కూడా మాతోపాటు ఉన్నారు.

"మనుషులు పోలిన మనుషులు ఉండవచ్చుగానీ, "నిన్ను చూస్తే ఎక్కడో బాగా చూసినట్టు అనిపిస్తోంది నాయనా" అంటూ నన్ను ఆత్మీయంగా ఆమె పలకరించారు. ఇంటర్వ్యూలంటే విసిగిపోయి ఉండడం వలన కాబోలు, ఇంటర్వ్యూగా వద్దులే కాసేపు మాట్లాడుకుందాం అన్నారు. ఆమె మాట్లాడుతుండగా వినాలనేదే మా తపన. ఇంక చాలని ఆమెకు అనిపించేంత దాకా రెండు గంటల సేపు ఏకధాటిగా మాట్లాడారు. 'పాటలాగా సాగిపోయింది నా జీవితం' అని ఆమె అంటున్నప్పుడు ఆ కళామూర్తి కళ్లలో మెరుపులు కనిపించాయి.

ఒక అంశంలోంచి మరో అంశంలోకి ఆమె ఆలోచనలు జాలువారుతూ తాదాత్మ్యతతో మాట్లాడుతుంటే అలవోకగా ఎన్నో ప్రాపంచిక విషయాలు కూడా ప్రస్తావనకొచ్చాయి. ఆఖరికి "ఇవ్వాళ పెళ్లి-రేపు విడాకులు'గా సాగుతున్న మన వివాహ వ్యవస్థ గురించి కూడా ఆమె తన మాటల్లో ఆవేదన వెలిబుచ్చారు.

ఇంక బయల్దేరి వచ్చేసేప్పుడు మమ్మల్ని సాగనంపటానికి ఆమె ఇంట్లోంచి బయటకు వచ్చి, అప్పుడు కూడా అదేమాట అన్నారు-"నిన్నెక్కడో చూసినట్టు ఉంది నాయనా" అని! నా పుస్తకాలు ఒకటి రెండు బహుమానంగా ఇచ్చాను. నేను తప్పకుండా చదువుతాను" అన్నారామె.

★ ★ ★

"రేపు పురస్కార సభకు వచ్చినప్పుడు ఒకరోజు మా దివిసీమలో ఉండండి. అక్కడ చాలా దేవాలయాలున్నాయి. శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణు దేవాలయం సందర్శించవచ్చు" అన్నారు బుద్ధప్రసాద్‌గారు. "శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు సినిమా కూడా వచ్చింది, అందులో "ఓ సుమబాణ ఓ పంచబాణ ఒక బాణమైన వెయ్యాలి" అనే పాట మీరు పాడారు..." అన్నారాయన. కాసేపు ఆ సినిమా గురించి జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నించారు సుశీలగారు.

నిజానికి, ఎన్ని సినిమాల్లో ఎన్ని పాటలు పాడారో ఆమెకే తెలియదు. నాకు రాసుకోవటం, దాచుకోవటం లాంటి అలవాట్లు లేవు. మా ఆయన ఉండగా అవన్నీ చూసుకునేవారు. నేను పట్టించుకునేదాన్ని కాదు" అన్నారామె. సినీ పరిశ్రమ, అభిమానుల అండదండలతో తన స్వరప్రస్థానం అలా సాగిపోయింది.

ఆమె పాటలంటే ముచ్చటపడే ఏడుగురు అభిమానులు సుశీలగారికి 'గిన్నిస్' ఘనత సాధించిపెట్టడంలో అవిశ్రాంతంగా పనిచేశారట.

"ఇన్ని భాషల్లో ఎలా పాడగలిగారు, ఆ భాష మీద పట్టు ఎలా దొరికిందీ?" అని ఆశ్చర్యంగా అడిగితే, భగవంతుడి దయ కొంత, చలపతిరావుగారి మహిమ మరింత" అన్నారు వినయంగా. "భాషలో సహజంగా ఉండే యాసని పట్టుకుంటేనే పాటకు దేశీయత వస్తుంది" అని ఆమె అభిప్రాయపడ్డారు.

నిజానికి, ఆమె ఏ భాషలో పాడినా, ఆ ప్రజలు సుశీల తమ భాషీయురాలేనన్నంతగా ఆమె పాటల్ని ఆదరించారు. ముఖ్యంగా చాలామంది తమిళులు ఆమెని తెలుగు మహిళ అంటే నమ్మలేరు. తమ ఆడపడుచేనని గౌరవంగా భావిస్తారు.

ఆమె దగ్గర రెండున్నరగంటల కన్నా ఎక్కువ సేపే గడిపినా, ఒక్క తమిళ పదం గానీ, ఆంగ్లపదం గానీ ఆమె నోట రాలేదు. తెలుగు భాషమీద ఆమెకున్న పట్టుకు ఇది నిదర్శనం. ఇదే పట్టుని ఆమె ఇతర భాషల్లోనూ సాధించటమే విశేషం.

★ ★ ★

"పాడేవారికి వయసుండదు- గొంతు మాత్రమే ఉంటుంది. సంగీతంలో రోగనిరోధక శక్తి లాంటిది ఏదో ఉందనుకుంటాను. పాటని పాడేవారికీ వినేవారికి కూడా సంగీతం ఆరోగ్యాన్నిస్తుంది. సంగీతాన్ని ఇష్టంగా వినటం కూడా పూర్వజన్మ సుకృతమే ననుకుంటాను. సంగీతంలో మునిగి తేలేవారికి బీపీలు, డిప్రెషన్లు, కండరాల నొప్పులూ ఉండవు. నరాల బలహీనత కూడా ఉండదు. ఆ మహిమ సంగీతానిదే!"

"మా కుటుంబ నేపథ్యంలో సంగీతం ఉంది. సంగీతవేత్తలకు, మహాకవులకు నెలవైన విజయనగరంలో పుట్టాను. నాన్న పులపాక ముకుందరావుగారు,అమ్మ శేషావతారం ఇద్దరికీ

సంగీత ప్రవేశం ఉంది. నాన్నగారు వీణవిద్వాంసులు కూడా! ఆయన విజయనగరంలో పేరున్న న్యాయవాది. ఆ రోజుల్లో మా ఇంటి చుట్టుపక్కల ఎవరికీ రేడియో లేదు. మా ఇంట్లోనే ఉండేదట. "విజయనగరంలో సంగీతం నేర్చుకునే రోజుల్లో రేడియో వినటానికి మీ ఇంటికి చాలా సార్లు వచ్చేవాణ్ణి" అని ఘంటసాల మాష్టారు అనేవారు.

"నా వయసు 83 యేళ్లు. ఒక సంవత్సరం ఎక్కువ చెప్పుకోవటమే నాకు ఆనందం. ఇప్పటికీ నేను పాడగలను. పాడుతూనే ఉన్నాను. ఉత్సాహంగా, ఉల్లాసంగానే ఉన్నాను కూడా!"

"7-8 యేళ్ల వయసులో ఉన్నప్పుడు డ్రామాలకు పాటలు పాడేదాన్ని. అనేక కార్యక్రమాల్లో సినిమా పాటలు పాడి బహుమతులు గెల్చుకున్నాను. ఆ చిన్న వయసులో నాకు సినిమా పాటలు తప్ప సంగీతం తెలియదు. నా ఉత్సాహం గమనించి మా నాన్నగారు విజయనగరం మహరాజ సంగీత కళాశాలలో చేర్పించారు. ద్వారం వెంకటస్వామి నాయుడు గారు, వారి అబ్బాయి భావనారాయణగారు సంగీతంలో నాకు తొలిగురువులు. హైస్కూల్ చదువుతోనే గాత్ర సంగీతంలో డిప్లొమా పూర్తి చేశాను. సంగీతాభినివేశం వలన నా పాటను నేనే మెరుగు పరచుకోగలిగాను"

ఇలా ఆమె ఒక ధారగా తన జ్ఞాపకాలను మాటలుగా మలిచి చెప్పుకుంటూ వెడ్తుంటే ఆ కాలానికి మేము కూడా ఆమెతో కలిసి వెళ్లిపోతున్నట్టనిపించింది.

మద్రాసులో సుశీలగారి అక్కయ్య వాళ్లుండే వాళ్లు. అందుకని తండ్రి ముకుందరావుగారు ఆమెని మద్రాస్ మ్యూజిక్ అకాడెమిలో సంగీతం విద్వాన్ డిప్లొమాలో చేర్పించారు. ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్ గారు ఆమెకు గాత్రంలో గురువులు. ఆ సమయంలో సంగీత కార్యక్రమాలను బాలమురళీగారు, లలిత సంగీత కార్యక్రమాలను రజనీగారు, బాలల కార్యక్రమాలను రేడియో అన్నయ్య న్యాపతి రాఘవరావుగారు,రేడియో అక్కయ్య కామేశ్వరి గారు చూసేవారు.

మద్రాసు మ్యూజిక్ అకాడెమీలో చేరాక రేడియోలో పాడటానికి ఆమెకు మంచి అవకాశాలు దొరికాయి. ఒక మహాగాయనిగా సుశీలగారు ప్రసిద్ధి పొందటానికి మద్రాసు రేడియో తొలి అడుగులు వేయించింది.

మాతో మాట్లాడుతూనే ఒక తాదాత్మ్య స్థితిలోకి వెళ్లి, సుశీలగారు బాలమురళిగారిని సంస్మరించుకున్నారు.

"అప్పుడు నాకు 15 యేళ్లే! ఒకసారి బాలమురళిగారి ఇంటికి వెళ్లి ఆయనను కలిసే అవకాశం వచ్చింది. "నీకేమైనా పాటలు వచ్చా?" అని బాలమురళిగారు అడిగారు. 'సినిమా పాటలు వచ్చు' అన్నాను. "అవి కాదమ్మా, లలితగీతాలు గానీ, కృతులుగానీ వచ్చా?" అని మళ్లీ అడిగారాయన.





"నాకు అలాంటివి రావు అప్పటికి. కృతి ఏదో తీసుకుని ఏడెనిమిది లైన్లు పాడాను. ఆయన వెంటనే లేచి లోపలికి వెళ్లిపోయారు. కాసేపాగాక బయటకు వచ్చి, చాలా బాగాపాడానని మెచ్చుకుని నన్ను సినిమాలకు పాడవలసిందిగా సూచించారు. నాలో సినిమాలకు పాడాలనే ఆలోచన, పట్టుదల కలగటానికి బాలమురళిగారే కారకులు. అదుగో తంబురా పుచ్చుకుని పాడుతూ కూరున్న ఆ ఫోటో ఆయనదే! నాకు ఆయనే బహుమానంగా ఇచ్చారు." అంటూ షో కేసులో ప్రముఖంగా పెట్టుకున్న బాలమురళీగారి ఫోటో చూపించారు.

బుద్ధప్రసాదుగారు లేచి వెళ్లి ఆ ఫోటోను చేతుల్లోకి తీసుకుని భక్తిగా ప్రణమిల్లారు.

"బాలమురళిగారితో కలిసి సినిమాలలో నాలుగైదు పాటలే పాడే అవకాశం వచ్చింది. కానీ, వారితో త్యాగరాజ కీర్తనలు ఒక ఆల్బంగా రూపొందించటం నాకు దక్కిన ఒక అదృష్టం అనుకుంటాను" అన్నారామె.

ఆమె మాట్లాడుతుంటే, పాటనూ ఆమెనూ వేరువేరుగా చూడటం కుదరదేమో అనిపించింది. పాట ఆమె జీవితంతో పెనవేసుకుని ఒక ప్రవాహంలా సాగింది. ఆమే పాట. పాటే ఆమె అనిపించింది.

★ ★ ★

"అప్పట్లో నిజాం రేడియో వేరుగా ఉండేది. అప్పటికింకా ఆంధ్రప్రదేశ్ ఏర్పడలేదు. నిజాం రేడియోలో తెలుగు తక్కువగా వినిపించేది. అయినా నన్ను పిలిచి కొన్ని పాటలు పాడించారు. వచ్చేప్పుడు 10 రూపాయలనోటు ఇచ్చారు. ఇంటికి వచ్చాక చూసుకున్నాను. మా తమ్ముడు నవ్వి, "అక్కయ్యా! అది నిజాం నోటు, మన ఊళ్లో చెల్లదు" అన్నాడు. నోటు చెల్లకపోవచ్చు, కానీ నా గొంతుకు చెల్లకపోవటం ఉండదు కదా... అనుకున్నాను"

★ ★ ★

"పెండ్యాల నాగేశ్వరరావుగారు 1951లో కొత్త గాయనిల కోసం వెదుకుతూ న్యాయపతి రాఘవరావుగారికి ఫోను చేసి ఐదు మంది గాయనీమణులు ఉంటే పంపమని అడిగారు. రాఘవరావుగారు నా పేరుకూడా పంపారు.

నాగేశ్వరరావుగారు మా ఐదుగురిని రకరకాలుగా పరీక్షించారు. నన్ను ఏదైనా పాడమన్నారు. నేను గజేంద్ర మోక్షంలోంచి లావొక్కింతయు లేదు-ధైర్యంబు విలోలంబమయ్యె" సీసపద్యం పాడాను. బాగానే ఉందంటూ అప్పటికి మమ్మల్ని పంపించేశారు.

ఆరు నెలలతరువాత నాకు వారి దగ్గర్నించి కబురొచ్చింది.

అప్పుడే వాళ్ల రికార్డింగు థియేటర్ ప్రారంభం జరుగుతోంది. బృందగానంలో ఒకరిగా అవకాశం ఇస్తారనుకున్నాను. కానీ, ఏ.ఎమ్.రాజాగారితో కలిసి పెట్రతాయ (తెలుగులో





కన్నతల్లి) అనే తమిళ సినిమాలో 'ఎదుకు అలత్తారు' అనే పాటను మొదటిసారిగా పాడించారు. ఆ పాట బాగా వచ్చింది. అదే వరుసలో మరో రెండు పాటలు కూడా పాడించారు. అలా బృందగానానికని వెళ్ళి పాటల బృందావనంలోకి ప్రవేశించగలిగాను.

తొలుత ఎ.వి.యం సంస్థకు, ఆ తరువాత అన్నపూర్ణ, విజయా సంస్థలకు పాడే అవకాశాలు వరుసగా వచ్చాయి. అన్నపూర్ణ సంస్థకు దొంగరాముడు సినిమాలో "భలే తాత మన బాపూజీ-బాలల తాత బాపూజీ" ఇలా 3 పాటలు జమునగారి కోసం పాడించారు. అవి గొప్పగా జనాదరణ పొందాయి. ఆతరువాత మరో గొప్ప ముందడుగు విజయా సంస్థ వారు నిర్మిస్తున్న మిస్సమ్మ చిత్రంలో "బాలనురా మదనా...", "బృందావనమది అందరిదీ" వగైరా పాటలు పాడే అవకాశం ఇచ్చారు. మాయాబజారులో నేను పాడిన "అహనా పెళ్ళంట" పాట నాకు, సావిత్రిగారికి కూడా ఎంతో పేరు తెచ్చి పెట్టింది.

★ ★ ★

తన భర్త 'డా. మోహన్' గారితో తొలిపరిచయాల ముచ్చట్ల గురించి అడిగితే ఆమె బాధగా "ఇప్పుడు లేని వ్యక్తుల గురించి దేనికీ...? అన్నారు. అంతలోనే తమాయించుకుని, అక్కడ(విజయనగరంలో) కలిసి చదువుకున్నాం. ఇక్కడ (మద్రాసులో) పెళ్ళి చేసుకున్నాం" అని నవ్వేశారు. కానీ, ఆమె మాట్లాడిన 100 మాటల్లో కనీసం 50 సార్లు భర్త మోహన్ గారిని తలచుకున్నారు.

"తమిళంలో ఎక్కువ పాటలు పాడటానికి ప్రత్యేక కారణమేమైనా ఉన్నదా?" అనడిగితే 'ఉంది' అని ఒక్కక్షణం ఆగారు. "మనం మద్రాసులో ఉంటున్నాం. ఇక్కడి జన జీవితంతో కలిసిపోయాం. అందుకని నువ్వు తమిళానికే ఎక్కువ ప్రాధాన్యత నివ్వు' అని అనేవారు మా వారు" అన్నారామె.

ఆమెకు అనుక్షణం కంటికిరెప్పలా రక్షణగా ఉంటూ, ఆమె సినీ జీవితాన్ని మెరుగుపరుస్తూ, మరింత సాధనకు అవకాశం కల్పిస్తూ, ఆమెను మోహన్ గారు నడిపించినట్టు ఆమె మాటల ద్వారా అర్థం అయ్యింది.

"నేను కచేరీలకు వెళ్లినప్పుడు నాతోపాటు మావారు కూడా వస్తూ ఉండేవారు. ఒకసారి ఎవరో ఆయన్ని 'మీరేం చేస్తుంటారు?' అనడిగారట. మా ఆయన నవ్వి, 'మందులిస్తుంటాను, ప్రిస్క్రిప్షన్లమీద ఆటోగ్రాఫులిస్తుంటాను' అనిచెప్పారట" అంటూ పెద్దగా నవ్వారామె.

నిజానికి నా సినీ సంగీత జీవితం వెలిగి పోవటం కోసం మా ఆయన తన కెరీర్ మొత్తాన్నీ త్యాగం చేసుకున్నారు" అన్నారు బాధగా.

"అందరూ బాగా పాడావని మెచ్చుకుంటుంటే మా ఆయన మాత్రం ఇంకా బాగా పాడాలని అనేవారు. ఇంకెలా పాడాలని నేను పౌరుషంగా అనేదాన్ని. అందరితో పాటు ఆయన పొగిడేవాడే అయితే, నన్ను నేను మెరుగు పరచుకోగలిగేదాన్ని కాదేమో...!" అన్నారామె.

"పాటలాగా సాగిపోయింది నా జీవితం. మా ఆయన లేకపోవటంతో మాట్లాడలేకపోతున్నాను, పాడలేకపోతున్నాను కూడా!" అంటున్నప్పుడు ఆమె కన్నీళ్లను దాచుకోవటానికి ప్రయత్నించారు.

"ఈ వయసులో పాడటం కష్టమే! అప్పటిలా పాడలేకపోవచ్చు కానీ పాడుతూనే ఉన్నాను. బాలమురళీ గారు ఆ వయసులో కూడా పాడుతూనే ఉన్నారు. చివరి రోజుల్లో ఆయనకు కొంత జ్ఞాపక శక్తి తగ్గినా మంచం మీదే ఉండి సంగీతాలాపన చేసేవారు. అదొక దివ్య వరం. అందుకే, నా నోటితో 'పాడను' అని ఎన్నటికీ అనను"

★ ★ ★

దాదాపు 10 భాషలలో వేల సంఖ్యలో పాటలు పాడి, ముఖ్యంగా దక్షిణ భారతదేశ సంగీత ప్రియుల్ని అమితంగా అలరించిన తెలుగు గానకోకిలని గిన్నీస్ బుక్ ఆఫ్ రికార్డ్స్ సంస్థ వారు అత్యధిక సంఖ్యలో మధుర గీతాలను పాడిన వ్యక్తిగా గుర్తించి గౌరవించారు. 60 ఏళ్ల సినీ సంగీత ప్రవాహంలో ఈ గానకోకిల ఆలపించినన్ని పాటలు ప్రపంచంలో ఏ గాయనీ పాడలేదు. పలు భాషలలో 18,330 పాటలు పాడిన ఏకైక గాయనీమణిగా ఏషియన్ బుక్ రికార్డు వారు పేర్కొన్నారు. నిజానికి వారు పరిగణనలోకి తీసుకున్నవాటికన్నా ఎక్కువ సంఖ్యలోనే ఆమె పాటలు పాడారు. ప్రఖ్యాత గాయనీమణి ఆశాభోంస్లే రికార్డును దాటి సుశీలగారు దక్షిణాది ఘనతను నిలబెట్టారు. ఈ ఘనతను ఆమె తనకు తొలిగా సినీగాయనిగా అవకాశాలు కల్పించి ప్రోత్సహించిన దివంగత సంగీత దర్శకులు పెండ్యాల నాగేశ్వరరావుకు, ఇంకా ఇతర సంగీత దర్శకులకు నివాళిగా ఆమె చెప్పుకున్నారు.

"పెండ్యాలగారు నన్ను వెండి తెరకు పరిచయం చేశారు. ఎం. ఎస్. విశ్వనాథంగారు, రామ్మూర్తిగారు, సాలూరు రాజేశ్వరరావుగారు స్వరభిక్షపెట్టారు. లయగర్భితంగా పాడటం ఘంటసాల మాష్టారు నేర్పించారు. టివి రాజుగారు, మాష్టర్ వేణుగారు మా ఇద్దరి చేతా చాలా డ్యూయెట్లు పాడించారు. ఆదినారాయణరావుగారు, జి. కె. వెంకటేష్ గారు, కోదండపాణిగారు ఒకరేమిటీ గొప్ప సంగీత దర్శకులంతా నాలోని సంగీతాన్ని బయటకు తీసి లోకానికి అందించారనే అంటాను".

★ ★ ★

ఆమె సినీ గాయనిగా 50 యేళ్లు పూర్తయిన స్వర్ణోత్సవ వేడుకల సందర్భంగా ఆమె ఇంక సినిమాలకు పాటలు పాడటాన్ని విరమించుకుంటున్నానని ప్రకటించి అందరినీ దిగ్భ్రాంతికి గురిచేశారు.

ఈ విషయమై ఆమెను ప్రశ్నించగా ఆమె చిరునవ్వే సమాధానంగా ఇచ్చారు. "మీరు కూడా పత్రికల వారిలాగా అడుగుతారేంటి...అన్నీ తెలిసికూడా!" అని మళ్లీ చిద్విలాసం చేశారు.

కాలం మారి పోతోంది కదండీ..." అన్నారు. కాస్త తమాయించుకుని.

"ఇప్పటి బీట్సు విని, మూలనున్న ముసలమ్మకూడా తలకాయిని, కాళ్లనీ ఊపుతోంది. పాటలు వ్రాయటం, పాడటం కూడా దానికి అనుసారంగానే సాగుతున్నాయి" అన్నారామె.

బుద్ధప్రసాదుగారు మధ్యలో అందుకుని, "ఇప్పటికీ ఘంటసాలగారు సుశీలగారు పాడిన పాటలు వినిపిస్తే ఆనందంగా ఆలకిస్తున్నారు. మీ పాటలు జీవించినట్టు నేటికాలపు పాటలు జీవించట్లేదు. వారం తిరిగేసరికి జనం మరిచిపోతున్నారు. మీ పాటల్ని ఇప్పటి తరం వాళ్లు కూడా ఆసాంతం అప్పుచెప్పినంతగా గుర్తుపెట్టుకుంటారు" అన్నారు.

దానికీ ఆమె మళ్లీ చిన్న నవ్వే సమాధానంగా ఇచ్చారు.

"ఆర్కెస్ట్రాలు మరీ మితిమీరి వాడటం ఇందుకు ఒక కారణమా?" అనడిగితే, ఆమె ఒప్పుకోలేదు. "ఆ రోజుల్లో కూడా 100-150 మంది ఆర్కెస్ట్రా ఉండేవాళ్లు. ఒక పాటను రికార్డు చేయాలంటే వందల సంఖ్యలో వాద్య కళాకారులు, సాంకేతిక నిపుణులు పనిచేసేవాళ్లు. పెద్ద పెళ్లి తంతులాగా ఉండేది పాట రికార్డింగ్ అంటే" అన్నారు.

ఒక సన్నివేశాన్ని చిత్రీకరించేందుకు నటీనటులు, వాళ్లనిబట్టి పాడాల్సిన గాయనీ గాయకులు, అందుకోసం వ్రాయాల్సిన పాట, దానికి కావలసిన వాయిద్య విశేషాలు -ఒక పాట సినిమాలో పండాలంటే ఇన్ని అంశాలు ఇమిడి ఉంటాయి! ఇదంతా ఒక సమిష్టి కృషి. మార్పులు ఈ సమిష్టిలోనే వచ్చాయి... ఆ మార్పుల్లో ఆమె ఇమడలేకపోవటం, మారిన సంగీత దర్శకుల దృష్టి, మితిమీరిన పాశ్చాత్య ప్రభావం, తగ్గిపోయిన శాస్త్రీయ సంగీత పరిజ్ఞానం... ఇవన్నీ మనకు కనిపిస్తున్న వాస్తవాలే!

"ఘంటసాల మాష్టారు, ఎస్. పి. బాలు గారూ, ఎ. ఎం. రాజాగారు ఇలా చాలా మంది గాయకులు సంగీత దర్శకులుగా కూడా పని చేశారు కదా... సంగీత దర్శకురాలిగా మిమ్మల్ని చూడాలని తెలుగు ప్రజల కోరిక" అన్నారు బుద్ధప్రసాద్ గారు .

"నాకు సంగీత దర్శకత్వం అంటే ఇష్టం కూడాను. గాయనిగా తీరిక లేకపోవటంతో దానిమీద దృష్టి పెట్టలేకపోయాను. ప్రస్తుతం సంగీత దర్శకత్వం పనిలోనే ఉన్నాను" అన్నారు సుశీలగారు సంతోషంగా.

ఆమె సంగీత దర్శకురాలిగా తిరిగి సినిమా రంగంలోకి అడుగుపెట్టబోతున్నారనే వార్తలు చాలాకాలంగా వినవస్తూనే ఉన్నాయి. అయితే కార్య రూపం ధరించలేదు. నీట్ పరీక్షలకు వ్యతిరేకంగా పోరాడి ఆత్మహత్య చేసుకున్న వైద్య విద్యార్థిని అనిత జీవిత వృత్తాంతం సినిమాగా తమిళంలో తీస్తున్నారని, దానికి సుశీలగారు సంగీత దర్శకత్వం వహిస్తున్నారనీ ఈ మధ్య పత్రికల్లో వార్త వచ్చింది కూడా! కొన్ని ప్రైవేట్ ఆల్బమ్'లు కూడా ఆమె సంగీత దర్శకత్వంలో వెలువడుతున్నాయి.

★ ★ ★





"నన్నింత దాన్ని చేసిన సినిమా రంగంలో నా తోటి గాయనీ గాయకులకు, ఇతర సంగీత కళాకారులకూ ఎంతో కొంత సాయపడే ఉద్దేశ్యంతో పి సుశీల ట్రస్టు" పేరున 2008 లో ఒక సేవా సంస్థని ప్రారంభించాను. అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. రాజశేఖరరెడ్డిగారు, సుబ్బిరామిరెడ్డిగారూ నా ట్రష్టుని ప్రారంభించారు.

20 మంది పేద కళాకారులకు గత పదేళ్లనుండీ నెలకు 2000 రూపాయల పెన్షను ఇస్తున్నాను.

నా తరువాత వచ్చిన గాయనీమణులను వరుసగా గత పదేళ్లుగా సుశీల పురస్కారం–లక్ష రూపాయల నగదుతో సత్కరిస్తూ వస్తున్నాను.

నాకన్న ముందునుండీ పాడుతున్న సీనియర్ గాయకుల్ని జీవనసాఫల్య పురస్కారం పేరుతో 25,000 రూపాయల నగదుతో గౌరవిస్తున్నాను.

నా ఆదాయంలో కొంతభాగాన్ని ఈ ట్రష్టు కోసం వినియోగిస్తున్నాను. తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత 50 లక్షల రూపాయలు ఇచ్చారు. విజేత వారు 50 లక్షలిచ్చారు. ఈ పదేళ్ల కాలంలో ఆ డబ్బంతా వ్యయం అయిపోయింది. ఎవ్వరో ఒక దాత మళ్లీ ముందుకొస్తారని నమ్మకం ఉంది" అంటూ తన పేరున స్థాపించిన ట్రష్టు గురించి వివరించారు.

జానకి గారి దగ్గరినుండీ చిత్రగారి వరకూ తనతో కలిసి పాడిన గాయనీమణులను ఆమె తలచుకున్నారు.

లీల గారితో కలిసి లవకుశలో పాడిన పాటల్ని గుర్తు చేసుకున్నప్పుడు ఆమె ఒకింత ఉద్వేగానికి లోనయ్యారు. "రామకథను వినరయ్యా ఇహపర సుఖముల నొసగే సీతా రామకథను వినరయ్యా"; "రామసుగుణధామ రఘువంశ జలధిసోమ సీతామనోభిరామా సాకేత సార్వభౌమ"; "లేరు కుశలవుల సాటి సరి వీరులో ధారుణిలో"; శ్రీరాముని చరితమును తెలిపెదమమ్మా ఘనశీలవతి సీతకథ వినుడోయమ్మా" పాటల్ని లీలగారూ సుశీల గారూ కలిసి పాడారు. "జగదభి రాముడు శ్రీరాముడే, రఘుకుల సోముడు ఆ రాముడే " పాటని ఘంటసాల, పి.లీల, వైదేహి, పద్మ, మల్లిక్ గార్లతో కలిసి సుశీల గారు పాడారు. ఆ సినిమా ఒక చరిత్ర అంటారామె. ఆమెతో మాట్లాడిన కొద్దిసేపట్లో లవకుశ గురించి రెండు మూడు సార్లు జ్ఞాపకం చేసుకున్నారు.

★ ★ ★

ఎక్కువమంది బాలనటులకు పాడిన ఖ్యాతి కూడా సుశీలగారికే దక్కుతుంది. బేబీ పద్మిని, బేబీ రోజారమణి, బేబీ శ్రీదేవి, మాస్టర్ బాబ్జీ, మాస్టర్ ఆదినారాయణ, మాస్టర్ ప్రభాకర్, మాస్టర్ రాము వీళ్ళందరికీ ఆమె సోలో గీతాలు పాడారు. అచ్చంగా వాళ్ళే

పాడుతున్నట్టనిపిస్తుంది. బాలనటిగా ఉన్న శ్రీదేవి కోసం బడిపంతులు సినిమాలో "బూచాడమ్మా! బూచాడు!! బుల్లిపెట్టెలో ఉన్నాడు" అనే ఆరుద్ర గీతాన్ని ఆమె అద్భుతంగా ఆలపించారు. శ్రీదేవి మరణించినప్పుడు తెలుగు వారికి ప్రముఖంగా గుర్తుకొచ్చింది ఆ పాటే!. సుశీలగారు కూడా ఈ పాటని తలచుకుంటూనే తన సంతాపాన్ని తెలిపారు.

షావుకారు జానకి కోసం 'పాండవులూ పాండవులూ తుమ్మెదా'; జమున కోసం 'గోదారి గట్టుంది-గట్టుమీనా చెట్టుంది'", 'మీరజాల గలడా నా యానతి'; జయలలిత కోసం 'మొక్కజొన్న తోటలో'-ముసిరిన చీకట్లలో"; 'ముత్యాల జల్లు కురిసే'; కృష్ణకుమారికోసం 'దూరాన నీలి మేఘాలు' అంజలీ దేవి కోసం సువర్ణసుందరి లో 'పిలువకురా అలుగకురా' అన్నది బడిపంతులు లో 'మీ నగుమోము నా కనులారా'; కాంచన కోసం 'అందెను నేడే జాబిల్లి"ఇలా ఒకపాటకీ మరోపాటకి సంబంధం లేనట్టుగ వైవిధ్యం నిండిన పాటలెన్నో పాడారామె. నాకు సుశీలగారితోనే పాడించాలని ఆనాటి నటీమణులు సంగీత దర్శకులను గట్టిగా అడిగేవారట.

★ ★ ★

సుశీలగారు ఈ యుగపు గంధర్వగాయని. సరస్వతీ దేవి మానసపుత్రిక. ఆమె తనపాట ద్వారా తెలుగు తేజాన్ని మరింత తేజరిల్ల చేశారు.

"మండలి వెంకట కృష్ణారావు తెలుగు వైభవ పురస్కారం" ప్రథమ తాంబూలంగా, తెలుగు అగ్ర గాయనికి చేసే 'ప్రథమ పూజ'గా భావిస్తున్నాను. పాటకు, భాషకు ఆమె అవసరం ఇంకా ఉంది. దాన్ని నెరవేర్చాలనే తపన ఆమెలో ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. పి సుశీల తెలుగు జాతికి, తెలుగు భాషకు దక్కిన ఒక వరం. తెలుగు భాష సుశీలగారి పాటలా తియ్యనైనదనేది నిజం.







# గానాన్ని గగనాన నిల్పిన బంగారు తల్లి!

– డా॥ గుడిసేవ విష్ణుప్రసాద్

స్వాగతం అమ్మరో! మా సుశీలమ్మా!
మధురగానము లొలుకు ఓ కోయిలమ్మా!!
గానగంధర్వమ్ము నీ గాత్రమమ్మా!
మా ప్రజలు అందించు స్వాగతము గొమ్మా!!

వేవేల గీతాలు నీ కంఠనాదాలు
మార్దవముగా మారి మరులు గొల్పెను తల్లి!
నీ గాత్రమును విని రసహృదయులంతా
రసడోలికల ఊగి తేలియాడిరి తల్లి!

అమరగాయకుడైన దివి ఘంటసాలతో
కలసి పాడిన పాటలమరమ్ము తల్లీ!
ప్రణయగీతములైన, ప్రణవనాదములైన
పదనిసలు పలికించి పాడినావమ్మా!

రాగరంజిత మనురాగరంజితమైన
తేనెసోనెలపాట నీదు వరమమ్మా!
తెలుగు చలనచిత్ర మధురగేయంబును
గగనాన నిల్పితివి బంగారుతల్లీ!!

వివిధ బాసలలోన, వివిధ యాసలలోన
రసరమ్య గీతాలు రంగరించితివమ్మ!
భక్తిగీతములైన, రక్తిరాగములైన
మధురిమల నొలికించె మా కోయిలమ్మా!
మా సుశీలమ్మా!!



అమర గాయకుడు శ్రీ ఘంటసాల, సంగీత దర్శకుడు శ్రీ టి.వి. రాజులతో శ్రీమతి పి. సుశీల



శ్రీ ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం - శ్రీమతి పి. సుశీల





# మధుర గాయనికి 'మండలి' పురస్కారం

**- డా॥ భూసురపల్లి వెంకటేశ్వర్లు**

హేమంతంలో గిలిగింతలు పెట్టే ఉదయ సంధ్య పిల్ల గాలులు, ఆ గాలుల్లో అలవోకగా కదిలే సెలయేటి అలల గలగలలు, మావి కొమ్మల చిగురులు మేసి ప్రకృతి పిలుపై పాడుతున్న ఆమని కోయిల కల కూజితాలు, మంద్ర మంద్ర మాధుర్య మురళీ రవ తరంగాలు, ఉదయ వేళ సాగిపోతున్న ఆలమందలు చిరు పవన తాకిడికి పులకించి తలలూపగా మెడలో ఘల్లు మంటున్న గంటల మ్రోతలు కలసి ప్రవహించు మృదుల శ్రావ్య గళం తెలుగు ప్రేక్షకుల కోసం ఒక భావ గీతాన్ని ఆలపిస్తే అది

**"సఖియా వివరింపవే!**
**వగలెరుగని చెలునికి నా కథా!**
**సఖియా వివరింపవే!"**

అనే సైరంధ్రి విరాట రాజు అంతఃపురంలో పాడిన అపూర్వ రాగ గీతం అవుతుంది. ఆ కంఠానికి రవ్వంత ఉత్సాహాన్ని జోడిస్తే

**"పాడనా తెలుగు పాట పరవశనై**
**నీ ఎదుట నీ పాట"**

అంటూ మాతృభాష పట్ల అభిమానమున్న ఎలాంటి శ్రోతనైనా పరవశింపజేస్తుంది. ఒకటేమిటి? నవరసాలు వేలాది పాటల్లో పలికించిన గొంతు నలభై వేలకు పైగా పాటలు పాడి ప్రపంచాన్ని రస రాగ డోలికల్లో ఉర్రూత లూగించిన గొంతు, పన్నెండు భాషల్లో పది కాలాల పాటు తనకు సాటి తనే అనిపించుకున్న స్వరం - వెరసి ఆమే ఆంధ్రుల అభిమాన గాయని పులపాక సుశీల.

ఉదయం నిద్ర లేస్తే ఆమె పాట వినని దక్షిణ భారతీయుడుండడంటే అతిశయోక్తి కాదు. భక్తిగీతం, దేశభక్తి గీతం, ప్రేమగీతం, యుగళగీతం, భావగీతం, విషాదగీతం ఇలా ఎలాంటి పాట వినాలనుకున్న వారికైనా ముందు వినిపించేది సుశీల పాడిన పాట. 'పసిబిడ్డలా గలగలా పలకాలన్నా, 'ముగ్ధ'లా మనోహర మూర్ఛనలు పోవాలన్నా, 'ప్రౌఢ'లా కోరిక నిండిన ధీరత్వం పలకాలన్నా, వయస్సు పండి అనుభవాన్ని రంగరించి పోయాలన్నా దక్షిణాది సినిమా రంగానికి చెందిన గాయనీమణుల్లో ఆమె ఒక్కరికే సాధ్యం అంటే అది నూటికి నూరు పాళ్ళు స్వభావోక్తి. అన్నిటికీ మించి దాదాపు నాలుగు దశాబ్దాల పాటు దక్షిణాదికి చెందిన అన్ని భాషల సినిమాల్లోనూ పాట పాడిన సుశీలే తమకు పాడాలని ప్రతి 'నాయిక' పాత్రధారిణీ కోరుకున్నారు. యుగళగీతం పాడిన ప్రతి గాయకుడు సుశీలగారితో పాడితేనే బాగుంటుందని

అభిప్రాయపడ్డారు. అలాంటి సందర్భం కలగడం ఆమె అదృష్టం అనడం కంటే ఆమె ప్రతిభ అనడం సమంజసం.

శ్రీమతి సుశీల కళలకు కాణాచి అయిన విజయనగరంలో సంప్రదాయ కుటుంబంలో పుట్టారు. శ్రీమతి శేషావతారం, శ్రీ పులపాక ముకుందరావు పుణ్యదంపతులు ఈమె తల్లిదండ్రులు. తల్లిదండ్రులిద్దరూ సంగీతాభిమానులే కావడం ఈమె అదృష్టం. పైగా తండ్రిగారు స్వయంగా వీణా విద్వాంసులు. ఆనాడు విజయనగరం తెలుగునాట సంగీత క్షేత్రంగా భాసిల్లింది. ఆదిభట్ల నారాయణదాసు, దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు, నందిగాన వెంకన్న, వీణ వెంకట రమణదాసు, ద్వారం వెంకట స్వామినాయుడు వంటి మహావిద్వాంసులు నివసించిన పుణ్యభూమి. రాజా ఆనంద గజపతి మహారాజు సంగీత పోషకులే గాక స్వయంగా విద్వాంసులు కూడా. ఇందరిని చూస్తూ, ఈ రంగంలో పరిచయమున్న ముకుందరావు దంపతులు తమ బిడ్డ గొప్ప సంగీత విద్వాంసురాలై ఎం.ఎస్. సుబ్బులక్ష్మి లాగా పేరు తెచ్చుకోవాలని కలలు కనేవారు. అలాగే బిడ్డను ప్రోత్సాహించి విజయనగరం మహారాజా సంగీత నృత్య కళాశాలలో చేర్పించారు. ఆ సమయంలో ద్వారం వెంకట స్వామినాయుడుగారు ప్రిన్సిపాల్. వారి కుమారులు భావనారాయణరావు అధ్యాపకులు. వీరిద్దరి శిక్షణలో సుశీలగారు గాత్ర సంగీతంలో డిప్లొమా పూర్తి చేశారు.

తల్లిదండ్రులు ఈమెని శాస్త్రీయ సంగీతంలో దింపి ప్రోత్సహించినా, గురువులు శాస్త్రీయ సంగీతాన్నే బోధించినా ఈమె దృష్టి మాత్రం లలిత సంగీతం మీదే ఉండేది. లతా మంగేష్కర్, భానుమతి, ఎస్.వరలక్ష్మి వంటి గాయనీమణులు పాడిన పాటలు ఎక్కువగా వినేవారు. అవంటే ఎక్కువ ఇష్టపడే వారు. డిప్లొమా పూర్తి చేశాక ఆంధ్ర దేశం నలుమూలల నుంచి కచేరీలు చేసే అవకాశాలు వచ్చాయి. ఎన్నో కచేరీలు చేశారు. అయితే కచేరీ ఉత్తరార్ధంలో పాడిన లలిత శాస్త్రీయ సంగీతం ప్రేక్షకుల్ని ఎక్కువగా ఆకట్టుకునేదట. నిజమే! ఆమె మనసు కూడా అటే నడుస్తుంది కదా!

ఆ రోజుల్లోనే సుశీలగారు చిత్తూరు రామ విలాస వారు జరిపిన సంగీత పోటీల్లో పాల్గొని ప్రథమ బహుమతిగా 'తంబురా'ను అందుకున్నారు. మద్రాసు, హైదరాబాద్, విజయవాడ ఆకాశవాణి కేంద్రాల్లో శాస్త్రీయ సంగీతం, లలిత సంగీతం కూడా బాలల కార్యక్రమాల్లో గానం చేశారు. కుమార్తె అభ్యున్నతిని కాంక్షించి ముకుందరావుగారు మద్రాసు మ్యూజిక్ అకాడమీ అనుబంధ సంగీత కళాశాలలో సర్టిఫికేట్ కోర్సు చేయడానికి సుశీలగారిని పంపించారు. ఆ కళాశాల ప్రిన్సిపాల్ తమిళనాడులో మహా విద్వాంసుల కోవకు చెందిన ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్. విద్యార్థి మనసెరిగి, అటువైపుగా ప్రోత్సహించడంలో ఆయన సిద్ధహస్తుడు. ఆ మూలంగా శాస్త్రీయతకి భంగం లేని లలిత సంగీతాన్ని ఆమె తెలుసుకున్నారు.

మద్రాసు ఆకాశవాణిలో 'బి' స్టేషన్ తెలుగు విభాగానికి చెందినది. అందులో బంధా

కనకలింగేశ్వరావు, రేడియో అన్నయ్య న్యాపతి రాఘవరావు బాలల కార్యక్రమాలు నిర్వహించేవారు. ఒకనాడు సుశీలగారు ఈ బాలల కార్యక్రమంలో పాల్గొనడానికి రేడియో స్టేషన్లో ఉండగా, ప్రముఖ సంగీత దర్శకులు పెండ్యాల నాగేశ్వరరావు బాగా పాడే పదిమంది పిల్లల్ని పంపించమని న్యాపతిగారికి ఫోన్ చేశారు. న్యాపతి వారు ఎంపిక చేసిన పదిమందిలో సుశీలగారు ఉండడం ఆమె భవిష్యత్తుకి బాట వేసినట్లయింది. పెండ్యాలగారు కె.ఎస్. ప్రకాశరావుగారు నిర్మించే "కన్నతల్లి" సినిమాకు సంగీత దర్శకత్వం వహిస్తూ, అందులో ఒక యక్ష గానంలో కోరస్ పాడడానికి ఈ పదిమందినీ పిలిపించారు. అయితే శ్రావ్యమైన సుశీలగారి గొంతు విని, ఆమె ఎవరి శిష్యురాలో తెలుసుకుని అదే సినిమాలో "లావొక్కింతయు లేదు ధైర్యంబు విలోలం బయ్యె" అనే పోతనగారి భాగవతంలోని పద్యం పాడించారు. ఆ పద్యం కూడా అద్భుతంగా రావడంతో సుశీలగారి దశ తిరిగిందని చెప్పుకోవాలి. ఎంతో ప్రతిభావంతులైన గాయకులు, గాయనీమణులు కూడా తమ జీవితకాలంలో పద్యం సరిగా పాడలేని వాళ్ళను ఎందరినో చూస్తాం. కాని సుశీలగారి సంగీత ప్రస్థానం పద్యంతోనే ప్రారంభం కావడం విశేషం. అనంతర కాలంలో తెలుగు పౌరాణిక సినిమాల్లో నాయికలు పాడిన ప్రతి పద్యం ఆమె గళం నుంచే రావడానికి ఇది నాంది అని చెప్పుకోవచ్చు.

ఈమె పాటలు విన్న సౌండ్ ఇంజనీర్ నాగరాజు వల్ల ఎ.వి.ఎం. మెయ్యప్పన్ చెట్టియార్ కు తెలియడం అక్కడ మూడేళ్ళు కాంట్రాక్టు కుదిరి అనేక పాటలు పాడడం జరిగింది. ఎ.వి.ఎం. వారి 'కనవన్ కన్ కణ్ద దైవం' సినిమాకి పాడుతుండగా విన్న అన్నపూర్ణ సంస్థ అధినేత దుక్కిపాటి మధుసూదనరావు, వారు కె.వి.రెడ్డిగారి దర్శకత్వంలో నిర్మిస్తున్న 'దొంగరాముడు' సినిమాలో పాడించారు. అందులో

**"అనురాగము విరిసేనా! ఓ రేరాజా!**
**అనుతాపము తీరేనా...."**

అనే పాట బాగా సక్సెస్ అయింది. అన్నపూర్ణ నుంచి విజయా సంస్థకి, అక్కడి నుంచి అన్ని సంస్థలకు..... అలాగే పెండ్యాల నాగేశ్వరరావు దర్శకత్వం నుంచి సాలూరి రాజేశ్వరరావుగారి వరకూ, ఆ తరువాత అందరి సంగీత దర్శకులతోను, అలాగే సహాయ పాత్ర నుంచి కథానాయిక పాత్రకు పాడే వరకు, ఆ తరువాత అందరు నాయికలకు పాడే వరకూ వెళ్ళిపోయారు.

పెండ్యాల, సాలూరి వారితో పాటు ఘంటసాల, మహదేవన్, అశ్వత్థామ, గాలిపెంచల నరసింహారావు, సుసర్ల దక్షిణామూర్తి, మాస్టర్ వేణు, ఆదినారాయణరావు, విశ్వనాథన్-రామ్మూర్తి, టి. చలపతిరావు, టి.వి. రాజు, సత్యం, కోదండపాణి, చక్రవర్తి, ఇంకా ఇళయరాజా వరకు ఎందరో సంగీత దర్శకుల దర్శకత్వంలో నలభై వేలు దాకా పాటలు పాడారు.

సావిత్రిగారి మొదలు అంజలీదేవి, జానకి, జమున, బి. సరోజాదేవి, కృష్ణకుమారి, దేవిక,





రాజశ్రీ, కె.ఆర్. విజయ, వాణిశ్రీ, రాజసులోచన, జయసుధ, జయప్రద, శ్రీదేవి, ఇంకా ఇంకా మీనా, రంభ వరకు ఎంతోమంది కథానాయికలకు నేపథ్యగానం చేశారు.

ఆమె పాటల ప్రస్థానంలో ఘంటసాల వెంకటేశ్వరరావుగారితో కలిసి పాడిన యుగళగీతాలను ప్రత్యేకంగా ప్రస్తావించుకోవాలి. ఇద్దరూ కూడా వారి పాటకు నటిస్తున్న పాత్రధారి గాత్ర ధర్మాన్ని అనుసరించేవారు. పాట ఆడియోలో వింటున్నా పాత్రధారులే కనిపించేటంత మమేకమై పాడేవారు. అంతేకాదు వీరిద్దరి కంఠ స్వరాలు కూడా ఏదో తెలియని కలయికతో శ్రోతల్ని మంత్రముగ్ధుల్ని చేసేవి. ఒక విధంగా వీరిద్దరి యుగళ గీతాలు తెలుగు చిత్రసీమకు ఆభరణాలని చెప్పవచ్చు.

సుశీలగారు ఘంటసాలగారితో పాటు బాలమురళీకృష్ణ, పి.బి. శ్రీనివాస్, ఎ.ఎం. రాజా, టి.ఎం. సౌందర రాజన్, మహమ్మద్ రఫీ, శీర్గాళి గోవిందరాజన్, కె.జె. జేసుదాస్, మాధవపెద్ది సత్యం, పిఠాపురం నాగేశ్వరరావు నుంచి ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, రామకృష్ణ వరకు ఎంతో మంది గాయకులతో యుగళ గీతాలు పాడారు. అలాగే పి. లీల, ఎస్. జానకి, వసంత మొదలైన వారితో కలిసి ఎన్నో పాటలు పాడారు. లీలగారితో కలిసి 'లవకుశ' సినిమాలో రామాయణ గానం చేయడం తెలుగువారు మరిచిపోలేరు. ఆ రామాయణం విని వారిద్దరినీ అక్కాచెల్లెళ్ళని చెప్పుకోగా నేను విన్నాను. సన్నివేశాన్ని కళ్ళ ముందుంచే భావ పటిమ సుశీలగారి గళంలో కనిపిస్తుంది. 'బడిపంతులు' సినిమాలో "మీ నగుమోము నా కనులారా కడదాకా కననిండు" అనే పాటలో యాభై ఏళ్ళు పండిన ప్రేమ కనిపిస్తుంది.

**"ఊరికే కొలని నీరు ఉలికి ఉలికి పడుతుంది**
**ఓరగా నెమలి పింఛ మార వేసుకుంటుంది.**
**ఎందుకో ప్రతి పులుగు ఏదో చెప్పబోతుంది**

వనములో చెట్టు చెట్టు కనులు విప్పి చూస్తుంది" అనే గీతాన్ని 'సంపూర్ణ రామాయణం'లో శబరికి పాడిన దేవులపల్లి కృష్ణశాస్త్రి గీతంలో ఒక పరిపక్వమైన భక్తితో ఒక జీవితకాలం ఎదురు చూసిన భక్తురాలి ఆర్తి అద్భుతంగా కనిపిస్తుంది.

**"నీలాల కన్నుల్లో మెల మెల్లగా**
**నిదుర రావమ్మా రావే! నెమ్మదిగా రావే!** అని 'నాటకాలరాయుడు' సినిమాలో పాడినా

"వట పత్ర శాయికి వరహాల లాలి" అని 'స్వాతిముత్యం' లో పాడినా అమ్మదనం రంగరించి, ఆనందాన్ని మేళవించి పాడారు. కించిత్తు చిలిపితనంతో–

**"చీరలెత్తుకెళ్ళాడు చిన్నికృష్ణుడు నా**
**చిత్తమేదో దోచాడీ చిలిపి కృష్ణుడు"** అని పాడిన సుశీల పురుషత్వాన్ని చూపిస్తూ





"అహ నా పెళ్లియంట .... ఓహో నా పెళ్ళంట" అని మాయా ఘటోత్కచుడిని మన కళ్ళ ముందు నిలబెట్టారు. నాట్య గీతాలు పాడడంలో సుశీల గారికి సాటిలేరనే చెప్పవచ్చు. 'రహస్యం' సినిమాలో గిరిజా కల్యాణం యక్షగానంలో ఆమె ప్రధాన పాత్రకు పాడారు. 'కాళిదాసు' సినిమాలో "జయ జయ శారదా.... జయకర విశారదా" పాట రాజసులోచన నాట్యానికి వన్నె తెచ్చింది. అలాగే 'శ్రీకృష్ణ విజయం'లో హేమమాలిని నాట్యానికి సుశీలగారి "జోహారు శిఖి పింఛ మౌళి" పాట గొప్పగా నప్పింది. నాట్యమెంత బాగుందో పాట అంత బాగుంది. 'తిల్లానా మోహనాం బాళ్' అనే తమిళ సినిమాలో నాదస్వరంతో కలసి "నలందానా నలందానా" అనే పాట కష్ట సాధ్యమైనా గొప్పగా పాడారు. ఇలా ఎన్నో ఎన్నెన్నో చెప్పుకుంటూ పోతే వందలు, వేలు. అయినా అవసరమైన చోటల్లా శాస్త్రీయత పాటిస్తూనే ఉన్నారు. "ఇన్ని వేల పాటలు పాడినా ఆనాడు నాయుడుగారి దగ్గర నేను అభ్యసించిన సంగీతమే నాకు బలం" అని ఆమె సగర్వంగా చెప్పుకున్నారు.

సుశీలగారు పొందిన అవార్డులను, సన్మాన సత్కారాలను గురించి చెపితే ఒక పెద్ద గ్రంథమే అవుతుంది. అయినా ఇక్కడ రేఖా మాత్రంగా చెప్పుకుందాం. జాతీయ ఉత్తమ గాయనిగా మూడుసార్లు తెలుగులోను, రెండుసార్లు తమిళంలోను అవార్డులందుకున్నారు. అలాగే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నుంచి ఆరు అవార్డులు, తమిళనాడు ప్రభుత్వం నుంచి మూడు అవార్డులు, కేరళ ప్రభుత్వం నుంచి రెండుసార్లు, ఉత్తమ గాయని పురస్కారాలందుకున్నారు. ప్రముఖ పత్రికలు నిర్వహించే బ్యాలెట్ ఆధారంగా ఉత్తమ గాయనిగా 17సార్లు ఎన్నికయ్యారు.

ఇవిగాక విదేశాల నుంచి వేలాది సత్కారాలందుకున్నారు. అందులో ముఖ్యమైనవి చెబుతాను.

1979లో డెట్రాయిట్ తెలుగు సంఘం, 1989లో తెలుగు అసోసియేషన్ ఆఫ్ చికాగో, 1995లో తానా, సౌత్ కాలిఫోర్నియా తెలుగు అసోసియేషన్, అమెరికన్ తెలుగు అసోసియేషన్ నుంచి జీవన సాఫల్య పురస్కారం 2004లో అందుకున్నారు.

జాతీయ స్థాయిలో కె.బి. సుందరరాజన్ అవార్డు, ఘంటసాల అవార్డు, ఎం.జి.ఆర్. సినీ కల్చరల్ అవార్డు, సుబ్బరామిరెడ్డి అవార్డు, శివాజీ స్మారక పురస్కారం, ఇంకా ఎన్నో అందుకున్నారు. మద్రాసులోని సంగీత సభలు చాలావరకు సత్కరించాయి.

ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాషింగ్టన్ విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్ ఇచ్చి గౌరవించాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2002లో ప్రతిష్టాత్మక రఘుపతి వెంకయ్య అవార్డు నిచ్చి గౌరవించింది. భారత ప్రభుత్వం 2008లో దేశ స్థాయిలో మూడవ సివిలియన్ అవార్డు "పద్మభూషణ్" ఇచ్చి గౌరవించడం మన జాతికి గర్వ కారణం.

సుశీలగారి జీవితంలోకొకసారి తొంగి చూస్తే వీరు విజయనగరానికే చెందిన డా॥ రాజా







భర్త రామ్మోహనరావుతో శ్రీమతి పి. సుశీల

రామ్మోహనరావుగారిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. అల్లుకున్న తీగలా సాగిన వారి జీవితం నుంచి హఠాత్తుగా రామ్మోహనరావుగారు 1990లో హృదయసబంధ వ్యాధితో మరణించారు. ఆ షాక్ నుంచి కోలుకుని మళ్ళీ సంగీతం వైపు రాలేకపోయారనే చెప్పవచ్చు.

ప్రస్తుతం వారు కొడుకు, కోడలు, మనుమరాలితో సత్యసాయి భక్తి తోడుగా ప్రశాంతంగా జీవిస్తున్నారు.

తెలుగు సాంస్కృతిక వైభవానికి ప్రతినిధిగా చెప్పుకోదగిన ఈ లలిత కళా సరస్వతికి ఈ ఏడాది మచ్చలేని మహా మనీషి, తెలుగు వారి సాంస్కృతిక పునరుజ్జీవన కోసం తన జీవిత కాలమంతా కృషి చేసిన మాన్య మహోదయులు, యావత్తు తెలుగు జాతిని తొలిసారిగా ఒకే వేదిక మీదకు చేర్చిన మహనీయులు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి పేరుతో నెలకొల్పిన “మండలి వెంకట కృష్ణారావు తెలుగు వైభవ పురస్కారా”న్ని సుశీలగారికి అందించడం ముదావహం. 4-8-2018వ తేదీన అవనిగడ్డ గాంధీక్షేత్రంలో నేడు ఆంధ్రుల సాంస్కృతిక పతాకమై వెలుగుతున్న మాన్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారి చేతుల మీదుగా ఈ పురస్కారం శ్రీమతి సుశీలగారు అందుకోవడం ఆంధ్రుల కళారంగ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయం. ఈ సందర్భంగా ఆ ఆంధ్ర కోయిలనభినందిస్తూ వారికి ఆయురారోగ్య భోగ భాగ్యాలు కలగాలని కాంక్షిస్తున్నాను.







# రజతోత్సవ గాయని

- పెండ్యాల

"ఏ ఊరమ్మా మీది?" అని అడిగాను ఆ అమ్మాయిని. ఆ అమ్మాయి 'విజయనగరమండీ' అన్నది. "సంగీతం ఏమన్నా నేర్చుకున్నావా" "ద్వారం వెంకటస్వామినాయుడుగారి దగ్గర అయిదేళ్ళు సంగీతం నేర్చుకున్నాను." "మరి సినిమాలో విడిగా ఏవైనా పాడావా?" "లేదండీ! ఇప్పటిదాకా అడపాదడపా రేడియో బృందగానాలలోనే పాడుతున్నాను." "అయితే మరి మద్రాసు ఎప్పుడు వచ్చావు?" "దాదాపు నాలుగేళ్లయిందండీ!" ఈ సంభాషణ అంతా 1951లో జరిగిన సంభాషణం. ఆనాడు నాతో మాట్లాడిన అమ్మాయి నేటి మేటి నేపథ్యగాయని శ్రీమతి పి. సుశీల.

కె.ఎస్.ప్రకాశరావు ప్రకాశ్ స్టూడియో నిర్మించి మొట్టమొదట 'కన్నతల్లి' నిర్మిస్తున్న రోజుల్లో జరిగిన సంఘటన అది. ఆ చిత్రంలో పసిపాపను దీవిస్తూ ముత్తయిదువలు కొందరు పాటపాడే దృశ్యం ఒకటి ఉంది. ఆ చిత్ర సంగీత దర్శకుడినైన నేను ఆ పాట పాడడానికి ఎనిమిది మంది గాయనీమణులు కావాలన్నాను. ప్రకాశరావుగారు అప్పుడు మద్రాసులోనే ఉన్న తమ స్నేహితులు రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవరావుగారికి ఫోను చేసి సంగతి చెప్పి,



శ్రీ పెండ్యాల - శ్రీమతి పి. సుశీల





రేడియో బృందగానాలలో పాడే ఓ పదిమంది అమ్మాయిలను పంపితే మేము ఎన్నుకుంటాం అని చెప్పారు. మరునాడు రాఘవరావుగారు పది మంది అమ్మాయిలను స్టుడియోకు పంపించారు. అందరిచేతా విడివిడిగా పాడించి విన్నాము. వారిలో ఒకమ్మాయి గొంతు మాత్రం ఎంతో ప్రత్యేకంగా ఉంది. ఉచ్ఛస్థాయిలో పలుకుతూ, సంస్కారయుతంగా ఉన్న ఆ గొంతు నన్ను ఆకర్షించింది. ఆ అమ్మాయి పేరు సుశీల.

ఆ తర్వాత ఆమె సంగీతాన్ని మరింత శ్రద్ధగా విన్నాను. ఆ మధురమైన గాత్రం, ఆ శారీరం, స్వర జ్ఞానంతో కూడిన ఆ పాడే తీరు అన్నీ నన్ను మరిమరీ ఆకర్షించాయి. ఆమెకు శాస్త్రీయ సంగీతంలో ఉన్న జ్ఞానం ఎంతటిదో నాకు అర్థమయింది. అవకాశం ఇస్తే సుశీల చక్కగా పాడగలదు అనే ధైర్యం కలిగింది. ఆ మాటే ప్రకాశరావుగారితో చెప్పాను. "ఆ అమ్మాయి చేత ఈ పాటలో విడిగా కొన్ని సోలో బిట్లు పాడిద్దాము. ఏమంటారు?" అని అడిగాను ఆయనను. ఆయన "నీ ఇష్టం నాగేశ్వరరావ్! నీకు నమ్మకముంటే పాడించు! కొత్త 'టాలెంట్'ను ప్రోత్సహించడం నాకు ఎప్పుడూ ఇష్టమే!" అని నన్ను ప్రోత్సహించారు.

ఆ ప్రోత్సాహంతో నేను సుశీల చేత ఆ బృంద గీతంలో సోలో బిట్లు కొన్ని పాడించాను. ఆ పాడినంతమేర ఆమె ఎంతో చక్కగా ధైర్యంగా పాడింది. రికార్డయిన ఆ బిట్లు ఆమె గొంతులోని మాధుర్యాన్ని తెలియజేశాయి. నాకు మరింత ఉత్సాహం కలిగి ఆ చిత్రంలో కథానాయిక కోసం "సిరికింజెప్పడు" పద్యాన్ని కూడా ఆమె చేతే పాడించాను. సింహేంద్రమధ్యమ రాగంలోని ఆ పద్యాన్ని అద్భుతంగా పాడింది సుశీల. ఆ శాస్త్రీయ రాగంలోని గమకాలన్నిటినీ ఆమె ఎంతో అనుభవం ఉన్న గాయకురాలిగా సరిగ్గా పాడింది. ఆమె గాత్రం చక్కగా రికార్డయింది. ఆ వెంటనే ఆ చిత్రంలో ఉన్న నాయికానాయకుల యుగళగీతం "ఎందుకో పిలిచావెందుకు" అన్న పాటను ఏ.ఎం. రాజాతో కలిసి పాడించాను.

ఆ పాట రికార్డింగ్ – సుశీల భవిష్యత్తుకు బలమైన పునాది వేసింది. ఆ రికార్డింగ్ కు వచ్చిన ఏ.వి.ఎం. వారి సౌండ్ ఇంజనీరు నాగరాజన్. సుశీల గొంతు విని ఎంతో ఆశ్చర్యపోయారు. ఆయన ఆ వెంటనే ఏ.వి.ఎం. చెట్టియార్ గారితో అంతవరకు అటువంటి 'టాప్ వాయిస్' రాలేదనీ, కనుక సెట్టియార్ గారు సుశీల పాట తప్పకుండా వినాలనీ చెప్పారు. దాంతో సెట్టియార్ గారు సుశీలను పిలిపించి ఆమె పాట విన్నారు. ఆ వెంటనే ఆయన ఆమె మూడేళ్ళపాటు తమ స్టూడియోలో మాత్రమే పాడాలనే నిబంధనతో ఒక ఒప్పందం కుదుర్చుకున్నారు. ఆ ఒప్పంద కాలంలో సుశీల గొంతు ఏ.వి.ఎం. చిత్రాలలో వినిపించింది. అది విని తక్కిన నిర్మాతలు కూడా ఆమెను తమ చిత్రాల్లో పాటలు పాడడానికి ఆహ్వానించారు. సుశీల సెట్టియార్ గారి అనుమతితో తక్కిన నిర్మాతల చిత్రాలలో కూడా పాడసాగింది. మూడేళ్ళు పూర్తి కాగానే సుశీలను అవకాశాలు వెదుక్కుంటూ రాసాగాయి. ఆ తర్వాత ఆమె పాటలు లేని చిత్రాలు అరుదయ్యాయి. దక్షిణ భారతదేశంలో నేపథ్యగాయనిగా ఆమె అద్వితీయ స్థానం సంపాదించడం ఆ తర్వాతి చరిత్ర.

ఈ పాతిక సంవత్సరాలలో సుశీల గళం తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ చిత్రాలలోని ఎన్ని పాటలనో రసవత్తరంగా పాడి ఒప్పించింది. ఆమె సింహళ, హిందీ భాషా చిత్రాలలో కూడా పాటలు పాడి ఆయా భాషల వారిని మెప్పించగలిగింది. ఆమె పాడిన ఎన్నో వేల పాటలలో సంగీత రసికుల ఆదరాభిమానాలను నోచుకున్న పాటలు కూడా ఎన్నో వేలు ఉంటాయి. చిత్ర సంగీతంలో ఘంటసాలగారు తమ నేపథ్యగానంలో ఒక కొత్త చైతన్యం తెచ్చారు. శ్రీమతి సుశీల కూడా అటువంటి చైతన్యాన్నే కలిగించింది. ఈ ఇద్దరు పాటలూ 'చిత్రాల విజయానికి పాటలు కూడా ముఖ్యాకర్షణలే' అని తేల్చాయి.

సుశీల పడిన వేలకొద్ది పాటలలో ప్రసిద్ధి గడించిన పాటలను లెక్కగట్టడం కష్టం. ఇక్కడ మరో విషయం చెప్పాలి. చిత్ర పరిశ్రమలో సంగీత దర్శకులు రాణించాలంటే వారు వరుసకట్టిన పాటలు పాడడానికి మంచి గాయనీగాయకులు కావాలి. అలాగే గాయనీగాయకులకు మంచి ట్యూన్స్ కావాలి. ఇది అవినాభావ సంబంధం. సుశీల వంటి చక్కని గాయని ఉన్నదన్న ధైర్యం ఎందరో సంగీత దర్శకుల చేత మంచి ట్యూన్స్ చేయించింది. అలా ఎన్నో మంచి పాటలు రూపొందాయి.

శ్రీమతి సుశీల గాయనిగా ఇంత ఘనత సంపాదించడానికి కారణం ఏమిటి? సుశీలను తెలిసినవారు ఈ ప్రశ్నకు సులభంగా సమాధానం చెప్పగలరు. అద్వితీయమైన విద్యతో పాటుగా ఉన్న వినయమే ఆమె ఘనతకు కారణం.

ఇన్ని సంవత్సరాలు గడిచినా సుశీల గొంతులో మాధుర్యం తగ్గలేదు. భావస్ఫూర్తితో పాడడం ఆమె ప్రత్యేకత. పాత్రనెరిగి గాత్రదానం చెయ్యడం సుశీలకు వెన్నతో పెట్టిన విద్య. తెరమీద ఏ తార కనిపిస్తే ఆ తారే పాడుతున్నట్లు అనిపించేలా పాడుతుంది సుశీల. అలాగే ఆమె గొంతులో పలకని భావం లేదు. ఆమె గానంలో ధ్వనించని రసం లేదు. సంగీత ప్రపంచంలో ఆమె ఒక అద్వితీయమైన ప్రక్రియ.

సుశీల పాడిన ఎన్నో వేల పాటలలో ఎన్నదగ్గ పాటలను ఎన్నుకోవడం కష్టం. అయితే ఆ పాటలలో నావికూడా కొన్ని ఉన్నాయని రసికులమాట. ఆనాటి 'దొంగరాముడు' లోని 'అనురాగము విరిసేనా', 'భలేతాత మన బాపూజీ'; 'ముద్దుబిడ్డ' లోని 'చూడాలనివుంది'; 'భాగ్యరేఖ' లోని 'నీవుండేదా కొండపై' మొదలైన పాటల నుండి నేటి 'రాజేశ్వరి విలాస్ కాఫీక్లబ్' లోని 'ఏమని పిలువనురా', 'ఆకాశ పందిరిలో' వరకూ ఎన్నో చిత్రాలలో విడి పాటలూ, యుగళ గీతాలూ పాడింది. ఇలాగే ఆమె అందరు సంగీత దర్శకుల దగ్గర అజరామరములైన పాటలెన్నో పాడింది.

ఉత్తర భారతీయులు సుశీల ప్రస్తావన వచ్చినప్పుడల్లా దక్షిణ భారతదేశపు 'లతా మంగేష్కర్' అంటుంటారు ఆమె గురించి. లత మీద సుశీలకు ఎంత గౌరవాభిమానాలు ఉన్నాయో సుశీల అన్నా లతకు అటువంటి భావాలే ఉన్నాయి. సుశీలకు అఖిల భారతస్థాయిలో బహుమతి లభించినప్పుడు మద్రాసులో జరిగిన సన్మానసభలో లత స్వయంగా సుశీలను

సన్మానించింది. ఆ సందర్భంలో సుశీల తన ఇంట విడిది చేసిన లతకు - నన్ను పిలిపించి తనను తొలిసారిగా వెండితెరకు పరిచయం చేసిన వ్యక్తిగా పరిచయం చేసి తన హృదయ వైశాల్యాన్ని చాటుకుంది.

ఆమె ఎన్నోసార్లు దక్షిణ భారత భాషలలో ఉత్తమ నేపథ్యగాయనిగా ఎన్నికైనప్పుడూ, అఖిల భారతస్థాయిలో రెండుసార్లు ఉత్తమ గాయనిగా జాతీయ బహుమతులు అందుకున్నప్పుడూ నా ఆనందానికి అవధులు లేవు. ఈనాడు ఆమె సంగీత రజతోత్సవ సందర్భంగా జరుగుతున్న సన్మానం నాకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నది. ఈ సన్మానం ద్వారా ఆంధ్రదేశమే తనను తాను సన్మానించుకుంటున్నది అనిపిస్తున్నది నాకు.

విలువకట్టలేని అమూల్య రత్నాన్ని మొదటిసారిగా కనుగొన్న వ్యక్తికి ఎటువంటి గౌరవం దక్కుతుందో శ్రీమతి సుశీల విషయంలో నాకు అటువంటి గౌరవమే దక్కింది. ఈ సంగీత రత్నాన్ని లోకానికి ఆవిష్కరించిన గౌరవం నాకు దక్కడం నా సుకృతం. పాతిక సంవత్సరాలుగా మొక్కవోని గళసంపదతో సంగీత రసికుల హృదయాలను ఆనందాబ్ధిలో ఓలలాడిస్తున్న చిరంజీవి సౌభాగ్యవతి సుశీల స్వర్ణోత్సవం కూడా చేసుకొని సంగీత సరస్వతికి ఇతోధికంగా సేవ చెయ్యాలని నా ఆకాంక్ష.

*(విజయచిత్ర)*





**శ్రీ ఏ.ఆర్. రెహమాన్ - శ్రీమతి పి. సుశీల**





# స్వరాధిదేవత

**- డా. దాశరథి**

ఆందోళికారాగంలో త్యాగరాజస్వామి వారి కీర్తన ఒకటి ఉంది -

**"రాగసుధారస పానముచేసి రాజిల్లవే ఓ మనసా!**
**యాగా యోగత్యాగ భోగఫల మొసంగే**
**సదాశివ మయమగు నాదోంకార స్వర**
**విదులు జీవన్ముక్తులని త్యాగరాజు తెలియు"**

నాదోంకారస్వరం తెలిసినవారు జీవన్ముక్తులు, అన్నారు త్యాగరాజస్వామివారు. రాగసుధారస పానముచేసి మనసును రాజిల్లమన్నారు. స్వామివారు తన జీవితాన్ని నాదానికీ, రాగానికీ అంకితం చేశారు. చిరకీర్తి సాధించారు. అయితే త్యాగరాజు కోరింది ప్రపంచంలో అంతా నాదోపాసన చేయాలనీ, తరించాలనీ, జీవన్ముక్తులు కావాలనీ.

రమారమి పదివేల వైవిధ్యం గల పాటలు పాడి, అనేక భాషలలో - ముఖ్యంగా తెలుగు, తమిళ భాషలలో - సామాన్య ప్రేక్షకుని నుండి - శ్రోతనుండి విద్వాంసుల వరకు అలరించిన సోదరి సుశీలగారి గానకౌశలం వర్ణనకు అందదు.

సినిమా మాధ్యమం ఆబాలగోపాలానికీ అందుబాటులో ఉండేది. ఆ మాధ్యమం ద్వారా ఏది అందించినా కోట్లాది ప్రజలకు అందులో ఆ ఘనత ఉంది.

సుశీలగారు జయదేవ మహాకవి అష్టపదులు, త్యాగరాజస్వామివారి కీర్తనలు గానం చేశారు. నావంటి సామాన్య రచయిత పాటలూ పాడారు.

ఇటీవల పూజ చిత్రంలో " నీ దయరాదా" అనే త్యాగరాజ కృతి పాడి 'భేష్' అనిపించుకున్నారు సుశీలగారు. అలాగే జయదేవ మహాకవి విరచిత "జయజగదీశ హరే", "చందన చర్చిత నీల కళేబర పీతవసనావనమాలీ" పాడి "సేబాసు" అనిపించుకున్నారు.

ఇక జానపద గేయాలు, యుగళ గీతాలు, బృందగీతాలు, శృంగార గీతాలు, మనస్సును ఆర్ద్రపరిచే కరుణామయ గీతాలు, అనేక రసాలను పండించే పాటలు వేలకువేలు పాడిన సుశీలగారి గానంలోని వైవిధ్యం గురించి పరిశీలించినప్పుడు ఆశ్చర్యం వేస్తుంది. ఆమె గానసరస్వతి. బహుముఖీనమైన సుశీలగారి ప్రతిభ అంత సులభంగా అందరికీ సంపూర్ణంగా అర్థమయ్యేదికాదు.

పందొమ్మిది వందల అరవై ప్రాంతంలో కావచ్చు నేను కొత్తగా మద్రాసు వచ్చి, మిత్రులు నాగేశ్వరరావుగారి అతిథిగా ఉన్నాను. ఆయన మహానటుడు. వారి ఇంట్లో అతిథిగా ఉండే

భాగ్యం కలిగినప్పుడు ఎందరెందరో పరిచయమయ్యారు. మద్రాసుకు అంతకుముందు కొన్నిసార్లు నేను వచ్చివున్నా, మద్రాసును దగ్గరగా, నిండుగా చూచే భాగ్యం నటసామ్రాట్టు అతిథిగా ఉన్నప్పుడే కలిగింది. ఏ వీధికి వెళ్ళినా, ఎక్కడికి వెళ్ళినా, సుశీలగారి తమిళ గీతాలు మారుమ్రోగి పోతుండేవి. సభల్లో, సమావేశాల్లో, ఇళ్ళలో, రేడియోలో సుశీల మధుర కంఠం వినబడుతుండేది. తెలుగులోనే, హైదరాబాదులోనే అనుకున్నాను. మద్రాసు మహానగరంలోనూ ఇంటింటా సుశీలగారి తీయని పాట వినబడింది. నిజానికి దక్షిణదేశంలో అంతటా ఆమె గణమాధుర్యమే! దక్షిణం వరకు మాత్రమే ఆమె గానం నియమితమైవుందా? లేదు. కులూ లోయలో ఒక సైనికుడు తన ట్రాన్సిస్టర్ లో సుశీల తమిళగీతం వింటున్నాడు.

తింటే గారెలే తినాలి, వింటే సుశీల పాటే వినాలి అన్నాడొక మిత్రుడు సామెతను తారుమారుచేసి. ఎందరో మహావిద్వాంసులైన సంగీత దర్శకులు సృష్టించిన బాణీలకు జీవంపోసింది సుశీల. అయితే ఇంతటి కీర్తిని గడించిన సుశీలకు, హీరోయిన్ కి ప్లేబ్యాక్ పాడదానికి (సావిత్రికి) ప్రముఖ చిత్ర నిర్మాత శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు అవకాశం ఇవ్వడంవల్లనే ప్రోత్సాహం లభించింది. 'నిరాశ్రయా నశోభంతే పండితా, వనితా, లతా' అని మన ప్రాచీనులు అన్నమాట సత్యదూరం కాదు. నటులనుగాని, గాయనీగాయకులనుగాని, రచయితలనుగాని విశాల హృదయులైన సుప్రసిద్ధ నిర్మాతలో, దర్శకులో మొదట అవకాశం ఇవ్వాలి.

శ్రీ దుక్కిపాటి మధుసూదనరావుగారు సుశీలగారికి ప్రోత్సాహమివ్వడమే కాదు ఎందరికో చేయూతనిచ్చారు. నన్ను చలనచిత్ర రంగానికి పరిచయం చేసిందీ వారే. మా సోదరి ప్రఖ్యాత రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి రచనలు వెండి తెరకు ఎక్కడానికీ ఆయన ఔదార్యమే కారణం. కొత్తవాళ్ళను లోకానికి పరిచయం చేయాలి అనే తహతహ ఆయనలో నాడూ, నేడూ వుంది.

సుశీలగారు "అత్తాన్ ఎన్నత్తాన్" అన్నపాట పాడిన కొత్తలో నేను మద్రాసు వచ్చాను. అంతటా అదే పాట. తెలుగు గాయని ఇంతగా తమిళుల ఆదరానికి పాత్రురాలు అయిందే! అని మురిసిపోయాను. ఆమె పాతికేళ్ళ సంగీత జీవితంలో - తాను పాడిన వేన వేల పాటలతో లక్షలాది - కాదు, కోట్లాది - శ్రోతలను అలరించింది. ఈ ఉదాహరణ నభూతో నభవిష్యతి - ప్రతిపాటా ఆమె పాడాలి అనే వారున్నారు. ప్రతి సంగీత దర్శకుడూ ప్రథమంగా ఆమె పాడాలనే అనుకుంటాడు.

ఇక కవుల మాటకొస్తే - మా పాట సుశీల పాడితే ఎంత బాగుండును? అని కలలు కనేవారు కొల్లలు. ప్రముఖ కవి 'ఉత్పల' తన " ఈ జంట నగరాలు, హేమంత శిశిరాలు" అనే కావ్యంలో "సుశీల పాడితే తనకు ధన్యత చేకూరుతుంది" అని ప్రతి కవి భావనగా ఆయన వర్ణించాడు. అది సత్యం.





అధిక ప్రచారం పొందిన నా పాటలు సుశీలగారు పాడినవి కావడం నా అదృష్టం. అలా అని ఇతర గాయనీమణులు పాడినవి అధిక ప్రచారం పొందలేదని కాదు. ఘంటసాల, జానకి కలసి పాడిన "నడిరేయి ఏ జాములో", యువకుడు, ఉత్సాహవంతుడు బాలసుబ్రహ్మణ్యం పాడిన " ఏ దివిలో విరిసిన పారిజాతమో" మొదలైనవి అశేష ప్రజాదరణ పొందినవే.

"మనసే కోవెలగా", "పాడెద నీనామమే", "వినిపించని రాగాలే", "అందెను నేడే అందని జాబిల్లి" ఇలా వ్రాస్తూ పోతే నా పాటలు కోకొల్లలుగా సుశీలగారి కంఠమాధుర్యంతో ప్రజలను ఆకట్టుకున్నవి.

నా దృఢ విశ్వాసం ఏమనగా - సుశీల తనలోని దైవదత్తమైన ప్రతిభను, వ్యుత్పత్యభ్యాసాలలో ద్విగుణీకృతం చేసుకుని సర్వాధిదేవతలా సంగీత లోకాన్ని పాతికేళ్ళుగా పరిపాలిస్తున్నదని. ఆమెలోని ఆ ప్రతిభ అనన్యం. ఆమె సాధన ఆమెకు శ్రీరామరక్ష.

ఆమె చలనచిత్ర జీవిత రజతోత్సవ సందర్భంలో నేను కోరేదొక్కటే - ఆమె ఇలాగే సర్వదా తన అమృతగానాన్ని కోట్లాది ప్రజలకు అందిస్తూ వర్ధిల్లాలి.

సర్వాధిదేవత సుశీల తెలుగు సరిహద్దులను ఏనాడో దాటి అఖిల లోకాన్ని ఆవహించిన సంగీత సుధాజలధి. తెలుగుభాష తెలియనివారు సైతం ఆమె తెలుగు పాటల రికార్డులు కొనుక్కొని, మళ్ళీ మళ్ళీ విని ఆనందించిన ఘట్టాలు నాకు తెలుసు. పెద్దలు చెప్పగా కూడా విని రుజువుపరచుకున్నాను.

సుశీల పాడుతుంటే ఆకాశంలో నక్షత్రాలన్నీ ఏకమై బృందగానం చేస్తున్నట్లుంటుంది నాకు. చందమామ వీణ తీగలు పలికిస్తున్నట్లుంటుంది. తోటలో కోకిల 'కూ' అంటే - "నువ్వు అక్కరలేదు. మా సుశీల పాట ఇదిగో ఈ క్యాసెట్ లో ఉంది, నువ్వు అడవులకు వెళ్ళిపో!" అనాలనిపిస్తుంది. సుశీల పాట వింటుంటే ఆకలి వేయదు. సుశీల పాడుతుంటే - పక్షులు ఆకాశంలో అలా ఆగిపోయి వింటాయనీ, చెట్లూ, కొండలూ సైతం ఆసక్తితో ఆలకిస్తాయనీ అనిపిస్తుంది. మనిషిని నిజమైన మనిషి చేయగల మధుర సంగీతహేల మా సుశీల.

*(రజతోత్సవ సంచిక)*







# సంగీత సరస్వతి

**– దుక్కిపాటి మధుసూదనరావు**

చిత్రరంగంలో అనన్య సామాన్యమైన ప్రతిభ ఉంటే తప్ప సాధారణంగా ప్రవేశం దొరకడం సాధ్యపడదు. ప్రవేశం దొరికినా ఒక సమున్నత స్థానాన్ని చేరుకోవడం చాలా కష్టం. ఆ స్థానాన్ని పాతిక సంవత్సరాల పాటు నిరాఘాటంగా నిలుపుకోవడం మరీ కష్టం. శ్రీమతి సుశీల ఈ కష్ట సాధ్యమైన గౌరవాన్ని పొందగలిగిందంటే ఆమె దీక్ష, కృషి, మంచితనం మాత్రమే కారణాలు.

సరిగ్గా పాతిక సంవత్సరాల క్రితం అన్నపూర్ణా సంస్థ అప్పుడే ప్రారంభింపబడి స్వర్గీయ కె.వి. రెడ్డిగారి దర్శకత్వంలో "దొంగరాముడు" చిత్ర నిర్మాణానికి సన్నాహాలు జరుపుకుంటున్నది. కథానాయకి సావిత్రికి నేపథ్య గాయనిగా అప్పటికే మంచి పేరులో ఉన్న "జిక్కీ"ని నిర్ణయించి, పెండ్యాల నాగేశ్వరరావుగారి సంగీత దర్శకత్వంలో కొన్ని పాటలు రికార్డు చేశారు. కథానాయకుని చెల్లెలి పాత్రధారణి జమునకు గాయని కోసం ప్రయత్నం చేస్తున్నాం. ఒకరోజు శ్రీ కె.వి. రెడ్డిగారు, నేను రికార్డు చేసిన పాటలు వినడానికి వాహిని స్టూడియోకి వెళ్లాం. థియేటర్ దగ్గరకు రాగానే ఒక కొత్త గొంతుక వినిపించింది. మమ్మల్ని ఎంతగానో ఆకర్షించింది. నారాయణన్ అండ్ కంపెనీ వారి "కవన నేకం కడ దైవం" అనే తమిళ చిత్రానికి సుశీల పాడిన పాట అది. వెంటనే జమున పాత్రకు సుశీలను నేపథ్యగాయనిగా నిర్ణయించాం. సుశీల గాత్రం, పీలగా ఉంటుందనీ, నూతిలోంచి పాడినట్లు వినిపిస్తుందనీ మిత్రులైన కొందరు పెద్దలు నిరుత్సాహ పరిచారు. కానీ మేము అధైర్య పడలేదు. సుశీలతోనే పాటలన్నీ రికార్డు చేశాం. "అనురాగం విరిసేనా" అన్న పాట విన్న తరువాత మమ్మల్ని నిరుత్సాహ పరచిన వారే, వారి వారి చిత్రాల్లో సుశీలకు అవకాశాలు ఇచ్చారు. అలా మా సంస్థకు మొదటి చిత్రంతో పరిచయమైన సుశీల, చిత్రరంగానికి పరిచయమై పాతిక సంవత్సరాలైంది. అంటే మా సంస్థ చరిత్రకు, సుశీల సినీ జీవితానికీ సుమారు ఒకటే వయసు.

1956వ సంవత్సరం సుశీల ఉజ్జ్వల భవిష్యత్తుకు బంగారు బాటలు వేసింది. అంత వరకు చిన్న చిన్న పాత్రలకు తన కంఠాన్నిస్తూ వచ్చిన సుశీల మొదటిసారిగా కథానాయిక పాత్రకు మా 'తోడికోడళ్ళు' చిత్రంలో పాడింది. తెలుగు, తమిళ భాషల్లో నిర్మించిన ఆ చిత్రానికి నాయిక (సావిత్రి) పాటలన్నీ రెండు భాషల్లోనూ సుశీలే పాడింది. రెండు భాషల్లోనూ ఆ చిత్రం ఘన విజయం సాధించింది. సుశీల ప్రాచుర్యం కూడా ఎంతగానో ఇనుమడించింది. బలమైన పునాదులు వేసుకుంది.

సుశీల అన్ని తరహా పాటలు పాడి మెప్పించగలరని ప్రారంభంలోనే నిరూపించింది.





తోడికోడళ్ళు తమిళ చిత్రం "ఎంగళీవీట్టు మహాలక్ష్మి"లో "పట్టణం డాన్ పోహలా నుడీ" అనే జానపద గీతానికి ఇ.వి. సరోజ నృత్యం చేసింది. ఆ గీత రచయిత ప్రఖ్యాత తమిళ కవి శ్రీ ఉడుమనై నారాయణ కవి. తన పాటకు ప్రాణం పోయగలిగింది ఒక్క సుశీల మాత్రమే నని పట్టుపట్టి పాడించుకున్నారు. వారన్నది నిజమైంది. చిత్రం విడుదల కాగానే ఆ పాట విపరీతమైన ప్రజాదరణ పొందింది. ఆ సంవత్సర ఉత్తమ తమిళ గీతంగా అత్యదికమైన ఓట్లతో తమిళనాడు, సిలోన్ కళాకారులు ఎన్నుకున్నారు. సుశీల ఉత్తమ నేపథ్యగాయనిగా ఎన్నో బహుమతులు పొందింది. తమిళులంతా సుశీలను తమ ఆడపడుచు అనుకున్నారు.

జానపద గీతాలు, బృందగానాలు, యుగళ గీతాలు ఎన్ని పాడినా గాయని స్వయం ప్రతిభను చాటి చెప్పేవి సోలో పాటలు. అలాంటి పాటలంటే సుశీలకు ఆసక్తి ఎక్కువ. అందులోనూ శాస్త్రీయ సంగీత మిళితమైన బాణీలు పాడినప్పుడు మరింత శ్రద్ధ వహిస్తుంది. విజయనగరం మహారాజా సంగీత కళాశాలలో ద్వారం వారి వద్ద శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించిన సుశీలకు హిందుస్తానీ, కర్ణాటక రీతులు రెండింటా సమానమైన ప్రతిభా వ్యుత్పత్తులు ఉన్నాయి. సన్నివేశాన్ని అర్థం చేసుకుని భావానికి ప్రాధాన్యతనిస్తూ రసవత్తరంగా పాడడం సుశీల ప్రత్యేకత. ఉదాహరణకు నేను నిర్మించిన 'ఇద్దరు మిత్రులు' చిత్రంలో "పాడవేల రాధికా", 'చదువుకున్న అమ్మాయిలు' లో "వినిపించని రాగాలే", 'డాక్టర్ చక్రవర్తి' లో "నీవు లేక వీణా", 'పూలరంగడు'లో "నీవు రావు నిదుర రాదు" ఈ పాటలన్నీ శ్రోతల ఆదరాభిమానాలు ఎంతగానో పొందాయి. సుశీల గాన మాధుర్యాన్ని చాటి చెప్పాయి. అలాగే ఎన్నో సంస్థల్లో ఎన్నో మధురమైన పాటలు పాడి నేపథ్య గానంలో అద్వితీయ స్థానాన్ని సంపాదించుకుంది. తనకు తానే సాటి అని నిరూపించుకుంది.

ఎన్నో గొప్ప పాటలు పాడినా, ఎంత మధుర గాయనిగా పేరు పొందినా ఇప్పటికీ ఆమె చేసే కృషి, చూపే పట్టుదల చూస్తే నిజంగా ఆశ్చర్యం కలుగుతుంది. శ్రీ సారథి స్టూడియోస్ వారికి నేను నిర్మించిన "ఆత్మీయులు" చిత్రానికి "మదిలో వీణలు మ్రోగె" అనే పాట రికార్డింగు సందర్భంలో అప్పటికి పదకొండు సార్లు టేక్ చేశాము. చివరి టేక్ విని సంగీత దర్శకులు శ్రీ రాజేశ్వరరావుగారు పాట చాలా అద్భుతంగా వచ్చిందని ఓ.కే. చేశారు. కానీ సుశీల ఆ టేక్ విని మరోసారి పాడతానంది. అంతకన్నా గొప్పగా పాడటం అసాధ్యమనీ, వృధా శ్రమ అనీ రాజేశ్వరరావు గారన్నారు. అయినా మరో ప్రయత్నం చేస్తానని పాడింది సుశీల. ఆమె పాడుతున్న పాట వింటూంటే అక్కడున్న అందరితో పాటు సంగీత దర్శకుడు కూడా తాదాత్మ్యంతో కంటతడి పెట్టుకున్నారు. అంతటి పట్టుదల, నిజాయితీ, శ్రద్ధ గల అరుదైన గాయని సుశీల.

తన గాత్రాన్ని అన్ని పాత్రలకూ, అందరు కళాకారిణులకూ అన్ని సన్నివేశాలకూ కావలసిన రీతిలో మలుచుకుని మార్చి పాడగల ప్రతిభావంతురాలు సుశీల. తెలుగు, కన్నడ,

తమిళ, మళయాళ, ఒరియా, సింహళ భాషలలో ఏ భాషలో పాడితే ఆ భాషే తన మాతృభాష అనిపించేంత సహజంగా స్వచ్ఛమైన ఉచ్చారణతో ఆమె పాడుతుంది. ఒకటి రెండు హిందీ చిత్రాలలో కూడా పాడి సంగీత దర్శకుల మెప్పులను పొందింది. మరికొన్ని అవకాశాలు వచ్చినా, దక్షిణభారతాన్ని వదిలి బొంబాయి వెళ్లి పాడడం ఇష్టం లేక విరమించుకుంది.

ఔత్తరాహికుల అభిమాని గాయని లతా మంగేష్కర్. లతా మంగేష్కర్ కు అభిమాని గాయని సుశీల. వారిద్దరి స్నేహం ఒకదానికొకటి శృతి చేసిన రెండు మాణిక్యవీణల యుగళనాదం.

దక్షిణ భారతదేశంలో ఉత్తమ గాయనిగా, సుశీల ఎన్నోసార్లు ఎన్నికై, ఎన్నో బహుమతులు, బిరుదులు పొందింది. ఉత్తమ గాయనిగా రెండుసార్లు జాతీయ బహుమతులు అందుకుంది. ఈ జాతీయ బహుమతిని రెండుసార్లు ఒకే గాయని పొందడం ఇంతవరకు జరుగలేదు. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని మద్రాసులో హెచ్.ఎం.వి., సరస్వతి స్టోర్స్ సంస్థల వారు అప్పటి ముఖ్యమంత్రి శ్రీ కరుణానిధి అధ్యక్షతన సౌభాగ్యవతి సుశీలకు ఘన సన్మానం చేశారు. కలకత్తా నుండి హెచ్.ఎం.వి. అధినేత వచ్చి లతా మంగేష్కర్ చేత వెండి వీణను బహూకరింప చేశారు. దక్షిణ దేశంలోని అన్ని భాషల సంగీత దర్శకులు, గాయకులు, గాయనులు, నిర్మాతలు ఆ సన్మాన సభలో పాల్గొని సుశీలకు పుష్పమాలలు సమర్పించారు. ఒక తెలుగు గాయనిగా తమిళనాడు ముఖ్య పట్టణంలో అంత గొప్ప సత్కారం జరగడం అదే మొదటిసారి.

*(రజతోత్సవ సంచిక)*



> సుశీల గళం పలికించని శృతి లేదు. ఒలికించని కుహూకృతి లేదు.
> 'జానపది' పాడినా, జయదేవుని 'అష్టపది' పలికినా
> ఆమె స్వరఝరి అవ్యక్త మాధురీ లహరి
>
> –డా. సి. నారాయణరెడ్డి

మండలి ఫౌండేషన్

ఆహ్వానం





'గాన కోకిల', 'పద్మభూషణ్'

శ్రీమతి పి. సుశీల గారికి

మండలి వెంకట కృష్ణారావు

తెలుగు వైభవ పురస్కార

ప్రదానోత్సవం

4 ఆగస్టు, 2018 సా॥ 4:00 గం.లకు

గాంధీక్షేత్రం, అవనిగడ్డ, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్

# కార్యక్రమం

| | | |
|---|---|---|
| సా॥ 4:00 గం.లకు | : | విద్యాసంస్థల ఆధ్వర్యంలో స్వాగతోత్సవం |
| సా॥ 5:00 గం.లకు | : | 'మండలి ఫౌండేషన్' ఆధ్వర్యంలో<br>**పురస్కార ప్రదాన సభ** |
| సభాధ్యక్షులు | : | జస్టిస్ **గ్రంధి భవానీ ప్రసాద్**<br>అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ విద్యుత్ నియంత్రణ మండలి |
| సభా ప్రారంభకులు | : | పద్మశ్రీ, 'కళాప్రపూర్ణ' డా॥ **తుర్లపాటి కుటుంబరావు** |
| విశిష్ట అతిథి | : | **శ్రీమతి వడ్డి విజయ చాముండేశ్వరి**<br>మహానటి సావిత్రి కుమార్తె |
| గౌరవ అతిథి | : | డా॥ **దీర్ఘాసి విజయభాస్కర్,** ముఖ్యకార్యనిర్వహణాధికారి,<br>ఆం.ప్ర. సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి |
| పురస్కార ప్రదాతలు | : | **శ్రీ మండలి బుద్ధప్రసాద్ - శ్రీమతి విజయలక్ష్మి**<br>ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి<br>**శ్రీ మండలి సత్యప్రసాద్ - శ్రీమతి వాణిశ్రీ**<br>**శ్రీమతి పద్యాల అన్నపూర్ణ - డా॥ చంద్రశేఖర్**<br>**శ్రీమతి మత్తి రేవతి - డా॥ కోటేశ్వరరావు**<br>**మరియు మనుమలు, మనుమరాళ్ళు** |
| ప్రత్యేక అతిథులు | : | **శ్రీ మత్తి శ్రీనివాసరావు,** అధ్యక్షులు, రోటరీ క్లబ్, చల్లపల్లి<br>**శ్రీ సంజయ్ కిషోర్,** 'సంగమం ఫౌండేషన్', హైదరాబాద్<br>**శ్రీ బేతిరెడ్డి శ్రీనివాస్,** కళాసుధ, చెన్నై<br>**శ్రీ జి.వి. పూర్ణచందు,** కృష్ణా జిల్లా రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి<br>**శ్రీ గోళ్ళ నారాయణరావు,** ఆంధ్ర ఆర్ట్స్ అకాడమి కార్యదర్శి |
| గ్రంథావిష్కరణలు | : | శ్రీ రావినూతల శ్రీరాములు రచించిన 'మహితాత్ముడు'<br>శ్రీమతి పి. సుశీల అభినందన గ్రంథం 'స్వరాధిదేవత' |
| వ్యాఖ్యాత | : | **కళారత్న శ్రీ ఎల్.వి. గంగాధర శాస్త్రి** |

ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి సౌజన్యంతో

**ప్రసిద్ధ సినీ గాయనీ గాయకులతో**
**శ్రీమతి పి. సుశీల సినీ సంగీత విభావరి**

**మండలి ఫౌండేషన్**

77

# అభినందన పత్రం



నాద ఓంకార స్వర రాగ సుధారస పానము చేయించి
సామాన్య శ్రోతల నుండి మహా సంగీత విద్వాంసులదాకా
తెలుగు ప్రజల మనసు రాజిల్ల చేసిన స్వరసరస్వతి
సినీ వినీలాకాశంలో తలుకు తారల నోట వినిపించిన పాట...
పాటల పూలతోటలో అరవిరిసిన సౌగంధికాపరిమళం
సురాగ సరాగాల కొమ్మకు విరబూసిన సప్తస్వరాల ప్రసూనమాలిక
తెలుగు పాటకు జగద్విఖ్యాతి తెచ్చిన గాయనీమణి
గానకోకిల పద్మభూషణ్ శ్రీమతి పి. సుశీల గారికి
సగౌరవంగా సమర్పిస్తున్న
మండలి వెంకట కృష్ణారావు తెలుగు వైభవ పురస్కారం.

సమర్పణ:




04-08-2018
గాంధీక్షేత్రం, అవనిగడ్డ

**మండలి ఫౌండేషన్**

డా॥ మండలి బుద్ధప్రసాద్
మరియు
'మండలి' కుటుంబం




# మండలి ఫౌండేషన్

గాంధీక్షేత్రం, అవనిగడ్డ - 521 121, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్

1. శ్రీ మండలి బుద్ధప్రసాద్
2. శ్రీ మండలి సత్యప్రసాద్
3. శ్రీమతి పద్యాల అన్నపూర్ణ
4. శ్రీమతి మత్తి రేవతి
5. శ్రీ మండలి వెంకట్రామ్
6. శ్రీ మండలి ఫణి సాయి కృష్ణ
7. శ్రీమతి కమ్మిలి ఉజ్వల
8. శ్రీమతి హేమ కీర్తి
9. శ్రీమతి శీలం కృష్ణ ప్రభ
10. శ్రీమతి కనపర్తి అవనిజ
11. శ్రీమతి పూషడపు సింధురి



# 'మండలి' జీవిత ముఖ్య ఘట్టాలు

| | | |
|---|---|---|
| 1. | జననం | 4.8.1926 |
| 2. | ప్రాథమిక విద్య | 1939-1945 |
| 3. | బందరులో కళాశాల విద్య | 1946-1951 |
| 4. | వివాహం<br>(భోగాది వెంకట్రామయ్య గారి కుమార్తె ప్రభావతీదేవితో) | 19.5.1952 |
| 5. | ఆంధ్ర కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శి | 1956-58 |
| 6. | బందరు నుండి పార్లమెంటుకు ఎన్నిక | 1957-62 |
| 7. | కృష్ణాజిల్లా పరిషత్ ఉపాధ్యక్ష పదవి | 1963-69 |
| 8. | అవనిగడ్డలో గాంధీక్షేత్రం ప్రారంభం | 1969, అక్టోబరు |
| 9. | అవనిగడ్డ సమితి అధ్యక్షులుగా ఏకగ్రీవ ఎన్నిక<br>ఆగ్నేయాసియా దేశాల పర్యటన | 1970 |
| 10. | అవనిగడ్డ నుండి శాసనసభకు ఏకగ్రీవ ఎన్నిక<br>సాంఘిక సంక్షేమ మంత్రి పదవి | 1972, ఫిబ్రవరి |
| 11. | 5 ఎకరాల భూదానం | 30.06.1973 |
| 12. | విద్యాశాఖా మంత్రిగా ప్రమాణస్వీకారం | 12.1.1974 |
| 13. | అధికార భాషగా తాలూకా స్థాయిలో ప్రకటన<br>అఖిల భారత సాంస్కృతికోత్సవాలు | 1974, ఉగాది |
| 14. | బాలలకు ఉత్సవాలు | 1974, దసరా |
| 15. | మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు | 12.4.1975 నుండి<br>వారం రోజులు |
| 16. | 50వ జన్మదినోత్సవం | 4.8.1975 |
| 17. | అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆవిర్భావం | 6.9.1975 |
| 18. | దివిసీమ మహా ప్రళయంలో ఆపన్నహస్తం | 1977 నవంబరు నుండి |
| 19. | కృతజ్ఞతా విదేశయాత్ర | 1983, అక్టోబరు |
| 20. | మలేసియా పర్యటన, 'తెలుగు దాత' బిరుదు | 1984, మార్చి |
| 21. | మారిషస్ లో 3వ ప్రపంచ తెలుగు మహాసభలు | 1990, డిసెంబరు |
| 22. | పరమపదం | 27.9.1997 |



'పద్మభూషణ్' పురస్కారం వచ్చిన సందర్భంగా
శ్రీమతి పి. సుశీలను అభినందిస్తున్న శ్రీ మండలి బుద్ధప్రసాద్



## మండలి వెంకట కృష్ణారావు

**(1926 - 1997)**

స్వర్గీయ మండలి వెంకట కృష్ణారావు ప్రప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించి విశ్వవ్యాప్తంగా ఉన్న తెలుగువారిని ఒకే వేదికపైకి తీసుకువచ్చారు. 'తెలుగుజాతి రత్నం'గా కీర్తింపబడినారు.

1977 నవంబరు 19న సంభవించిన ఉప్పెన - తుఫానులో ప్రాణాలను సైతం లెక్కచేయకుండా పనిచేసి 'ఆర్తజన బంధువు'గా కీర్తింపబడినారు. మరుభూమిగా మారిన దివిసీమను అచిరకాలంలోనే దివ్యసీమగా మార్చిన ఆధునిక దివిసీమ నిర్మాత ఆయన. 1968 - 1969లో గాంధీ జయంతి సందర్భంగా గాంధీక్షేత్రాన్ని నెలకొల్పి గాంధేయ నిర్మాణ కార్యక్రమాలకు కేంద్రంగా తీర్చిదిద్ది 'దివిసీమ గాంధీ'గా పేరుపొందారు.

మండలి కుటుంబ సభ్యులు వారి స్మారకార్థం 'మండలి ఫౌండేషన్' నెలకొల్పి లక్ష రూపాయల నగదు, జ్ఞాపికతో మండలి వెంకట కృష్ణారావు తెలుగు వైభవ పురస్కారాన్ని ప్రసిద్ధ తెలుగు ప్రముఖులకు అందజేయాలని నిర్ణయించింది. తొలి పురస్కారం స్వరాధిదేవత శ్రీమతి పి. సుశీలకు 4-8-2018న ప్రదానం చేయడం జరిగింది.

